


Reg. No. 757

శ్రీ

# అభినవసరస్వతి.

యను నొక మాసపత్రిక
అష్టావధాని జానపాటి పట్టాభిరామ
ప్రచురింపఁబడుచున్నది.
గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు

సంపుటము 7 | 1915 అక్టోబరు | సంచిక 10

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 2 0 0 |

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

# ప్రధానపోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 శ్రీ రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహాదరు జమీందారులు నూజివీడు

2 రాజా వెంకటాద్రిఅప్పారావు బహాదరు జమీందారుగారు, నూజివీడు

3 రాజా వాశిరెడ్డిచంద్రమౌళీశ్వరప్రసాదు బహాదరుమన్నెసుల్తాన్ జమీందారుగారు ముక్త్యాల

4 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

5 రామశింగుగారు నెల్లుట్ల షాపురపు సంస్థానము మేనేజరు నెల్లుట్ల

6 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు.

7 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చొల్లేరు.

8 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట

9 గూడూరు వీరసాంబశివరావుసర్దేశపాండ్యాగారు, మాలెకొండూరు

## సహాయులు.

1 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

2 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి

3 నరసింహాచార్యులుగారు-పట్వారీ-కొలనుపల్లి

4 హనుమంత రెడ్డిగారు క్షీరసాగరము

5 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి

6 నందూరు లక్ష్మీనరసింహారావుగారు, కరణం, నందూరు.

7 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

8 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్ల

9 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యాడవరము.

10 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు

11 హేజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ

12 మురసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద

13 కాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట

14 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజర్లపాడు

15 వెలుగూరి పిచ్చయ్యగారు కొదనుగుండ్ల

# అభినవ సరస్వతి

సంపుటం. 7  జానపాడు.
రాక్షస సం॥ ఆశ్వయుజము.  సంచిక. 10

## కృతివిమర్శము.

బ్రహ్మాండపురాణము:—ఇది కడప మునిసిపల్ హైస్కూలు తెలుఁగు పండితులగు జనమంచి శేషాద్రిశర్మగారిచే దెనిఁగింపఁబడిన యొక పెద్దగ్రంథము. ఇది ప్రశంస 2 పేజీలును కృతజ్ఞత 7 పేజీలును నుపకారస్మృతి 1 పేజీయును బంచాగ్నుల దక్షిణామూర్తిశాస్త్రిగారి భూమిక 14 పేజీలును సంపాదకీయభూమిక 8 పేజీలును విషయసూచిక 8 పేజీలును బండితాభిప్రాయములు మొదలైనవి 12 పేజీలును గాక కేవల గ్రంథభాగము రాయల్ సైజున 824 పేజీ లున్నయది. గ్రంథకర్త తన సహజౌదార్యముం బ్రకటించుచు మాకార్యస్థానమున కీపురాణము పంపుటంబట్టి యెద్దియో మాయభిప్రాయము నొకింత యీయవలసినవార మేకాని యితఃపూర్వమే యభిప్రాయముల వెలువరించినవారిలో మే మెందునను బోలము. అనేక మహాపండితుల స్తుతికిఁ బాత్రమైన యేతత్పురాణమునకు నా సదభిప్రాయము చంద్రునకు నూలుపోగు సామ్యమే కాని యంత కెక్కువ కాఁబోదు. వేయేల? పంచాగ్నుల దక్షిణామూర్తిశాస్త్రిగారి భూమికయే యేతత్పురాణసర్వసుగుణములను వెల్లడించియున్నయది. పనసపండువంటిది యీపురాణమును దివ్యమామిడిపండువంటిది దక్షిణామూర్తిశాస్త్రిగారి భూమికయు నైయున్నయవి. ఈరెంటికిని స్థౌల్యసౌక్ష్మ్యభేదమే కాని మాధుర్యభేద మించుకయుఁ గాన్పింపదు. శాస్త్రిగారి భూమికలోని

"ఆశుకవులకు గణాచారులకు లెక్కయే లేదు. పిల్లకవులు బాలకవులు చన్నబాలకవులు ఎందఱో మహానుభావులు లోకసంగ్రహముపొంటె నవతరించుచున్నారు. ఈత్రూపునఁ బ్రౌఢకవులకుఁ బ్రవేశము చిక్కదు. తరతమభావము లేక యల్పు లధికుల మీఁదఁ గాలుద్రవ్వుచున్నారు...అశిక్షితులు భాషాసంశీలనము చేయఁగడఁగినారు. తెలియనివి తప్పులనుచున్నారు. తమయధీరహృదయముల కెక్కనిభావములను నీరసములు నశ్లీలములు ననుచున్నారు. తెలిసీతెలియని హూణభాషాపరివర్తితముల గిలకరించుచున్నారు...కవులను బందుబూతులఁ దిట్టుచున్నారు. పండితులపై శిలావర్షము గురియుచున్నది...బ్రహ్మాండపురాణ గతములని వినఁబడు కొన్నియసందర్భపుగాథ లిందుఁ గనఁబడలేదు...గ్రంథ మామూలాగ్రము తు చ తప్పకుండఁ బరివర్తించఁబడినను మక్కికి మక్కి యనునట్లు గాక సందర్భరమణీయముగాఁ జిన్నచిన్న మార్పులు చేయఁబడియే యున్నవి''.

అను పంక్తులం దిలకించి వారివాఙ్మాధుర్యముం జవిచూడఁ గోరుచున్నవారము. బ్రహ్మాండచరిత్రము విపులముగఁ జెప్పఁబడియుండుటవలన బ్రహ్మాండపురాణమను పేరు దీనికిఁ గలిగినది. దీనియం దనేకధర్మములు చెప్పఁబడియున్నవి. దీనిని ధర్మశాస్త్రముగ నుపయోగించుకొనుట కీపసాక్షత్రమును సంశయింపఁబనియుండదు. పరశురామ చరిత్రము సమగ్రముగ నిందువర్ణింపఁబడినది. అవ్వియివ్వియననేల? పెక్కుగాథలు పెక్కుధర్మములు విపులముగ నిందు వక్కాణింపఁబడియున్నయవి- మేము సంస్కృత గ్రంథము నొద్దనుంచుకొని దానికి సరిగనున్నదాలేదా యని యంతశ్రద్ధచేయలేదుకాని దక్షిణామూర్తిశాస్త్రిగారిభూమికను సంపాదకీయ భూమికను జూచినఁ గథాభాగమును వదలక వర్ణనాంశములలోమాత్ర మించుకవృద్ధిసంకోచములుచేసినట్లు కాన్పించెడిని. ఇందలిధర్మము లనేకములు చదువరులకుఁ జూపఁదగినవియైనను గ్రంథవిస్తరభీతిచే వదలి యీపురాణమునే తెప్పించిచూచి కొనఁగోరుచు వదలలేని యొకకొన్నిమాత్ర మిందు మచ్చునకుఁగా జూపుచున్నవారము.

చ॥ చరణభవుల్ నికృష్టకులజాతులు వృద్ధి తగంజెలంగ భూ
సురులభిమానమున్విడిచి సుంతయు ధర్మములోనఁ బెంచ కా
తురులయి వారిత్రోడ సుమతుల్ చెడ నాసనభుక్తిశయ్యలన్
నిరతము మైత్రిఁగూడుదురు నేర రొనర్పఁగ రా దిపం చెవన్॥

క॥ వర్ణాశ్రమధర్మంబుల, నిర్ణయమునువదలి వేదనిందకులయి దు
ర్వర్ణులఁగూడినవారల, వర్ణనమిపుడేలపుత్ర! వార లయోగ్యుల్॥

చ॥ చరణజులెల్ల విప్రకులసంతతిఁగూడిచరింత్రు, బ్రాహ్మణుల్
చరణభవాశ్రయంబుగని సంతతసేవయొనర్చు మండి య
ధ్వరములువారుసేయఁ గలివైభవయుక్తిని యాజనక్రియా
పరిణతచిత్తులై మెలఁగువారు జఘన్యులు పొల్తురింతయున్॥

ఆ॥ మంత్రవేత్తలగుచు మాన్యులౌద్విజులను, దుష్టవాక్యవితతిఁ దూలనాడు
వారుశూద్రులెల్ల బ్రాహ్మణుల్ క్రమముగ, క్షీణమొందువారు త్రాణలేక॥

క॥ కలియుగశేషంబున వి, ప్రులుక్షీణమునొంది నీచబుద్ధులగుచు నా
కులమొందువారు, పాపాత్ములు వృద్ధిని గాంచువారు, మునివరులారా!

వృత్తాంతమైన చాలుపైనిజాలునకుఁ జాల్చాలుననియు నిత్తుమీఁదియత్తున కిదంచునరియుఁ గూర్చినసంధులును నాయె నయ్యె ననియుండవలసిన యాగుధాతువు నయెనని ప్రయోగించుటయు నన్వయపూర్తికానిదే సత్కృపన్, ఈవుతర,తృప్తియున్, అనురాగంబు, భూపతిన్, అనిమిష, బొందితిన్, అసమెసగంగ, కరముల్, అవిరోధ యని పాదాంతగతవృత్తాంతముల స్వాగతులనిల్పుటయు క్షీణశబ్దము ధర్మపరముగా బ్రయోగించుటయు మాత్రము మాబుద్ధిక యతిక్రమించి సంశయాస్పదములుగనున్నయవి కాని కేమేని యాధారములఁజూడక శ్రీశర్మగా రుపయోగింపరనియూడఁ దలఁచెదను.

దీనివెల రు 4-0-0 లు

నంజేసి జాతిభేదం బొకప్పుడు పరికింప దుశ్శక్యంబైన నాయాసమయంబులలోఁ దనగుణము గాన్పించక మానదని లభించుచున్నయది.

జాతిభేదంబు లీభరతఖండంబునను బూర్వకాలమునుండి లేవు. ఇటీవల గల్పింపఁబడినవని గొందఱుఁపట్టుదలతో మాటలాడుదురు. ఇది కేవలమసత్యము. ప్రపంచములోని మతగ్రంథములలో వేదము లతి పురాతనగ్రంథములు. వానిలోన ఋగ్వేదము మిక్కిలిపురాతన మని చరిత్రవిమర్శనశీలురు అంగీకరించుచున్నవారలు ఇట్టిఋగ్వేదంబున బురుషసూక్తంబనునది జేరియున్నది. దీనిసూత్రిమూర్తి దేవతాభిషేకమందునను బారాయణంబందున నిప్పటికిని బ్రాహ్మణోత్తములుపయోగించుచున్నారలు. ఇట్టిపురుషసూక్తంబున శ్రు॥ "ముఖంకిమస్యకౌబాహూ। కావూరూపాదావుచ్యేతే। బ్రాహ్మణోఽస్యముఖమాసీత్। బాహూ రాజన్యఃకృతః। ఊరూతదస్యయద్వైశ్యః। పద్భ్యాగ్ంశూద్రోఅజాయత" యనుమంత్రములుగలవు. పరమాత్మకు ముఖమెద్ది? భుజములెయ్యవి? తొడలెయ్యవి? పాదములెయ్యవి? యని-యొకమహర్షి మరియొకరినడిగినట్లు మొదటిమంత్రము చెప్పును. బ్రాహ్మణుండీపరమాత్మకు ముఖము, క్షత్రియుఁడు భుజములు, వైశ్యుడూరువులు, పాదములవలన శూద్రుఁడు గలిగెనని సమాధానము సెప్పినట్లు రెండవమంత్రము ప్రవర్తించెను. ఇది సృష్టిప్రకరణమగుటచేత నీమంత్రమును జక్కఁగాఁ బరిశీలించినచో బరమాత్మముఖమునుండి బ్రాహ్మణవర్ణము గలిగెను. భుజములనుండి క్షత్రియవర్ణము గలిగెను. ఊరువులనుండి వైశ్యవర్ణము పాదములనుండి శూద్రవర్ణము గలిగెనని తేటపడుచున్నది. పరమాత్మ ముఖమునుండి బ్రాహ్మణుం డెట్లుగలుగును? మొగమున స్వేదము, వికాసము, సంకోచము మొదలగు వికారములు దక్క నన్యముచూపట్టదు గాన నీశ్రుతి యసత్యపు టర్థమును జెప్పుచున్నదని దీననే దేటపడుచున్నదని గొందఱు శంకింతురు. ఇదియల్పశంకయే. సర్వశక్తులు గల పరమాత్ముం డింతటిభూగోళము ఖగోళము మొదలగు వానిని సృజించెను. సామాన్యముగ నొక మట్టిముద్దను జేయవలసివచ్చినచో నామట్టి నెన్నిపర్యాయములో పాకము జేసి చేతులతో గుండ్రముగా జేసినగదా ఆపని కొనసాగును. ఇటులుండ ఎన్నియో వేలయోజనముల చుట్టుకొలతగల మహాగోళములగుండ్రని యుండలగా జేయుటకెన్ని వేల యోజనముల పొడవుగల చేతులు కావలయును. దానికి దగిన శరీర

మెంతదై యుండఁబోవును. అట్టిశరీర మిప్పటికి నున్నయెడల నేల కనుపట్టదు. అట్టిప్రయత్నము మనకు లేనందున కనుపట్టదందురేని యేప్రయత్నము నవసరము లేకయే ప్రతిమనుజునకు దర్శనమిచ్చెదముగాన మనమే పరమాత్మకంటె దయాళువులము గావలసివచ్చును. పరమాత్మ సర్వశక్తులుగలవాఁడు గాన నంతటిసాధనములతో బనిలేదంటిరేని బ్రాహ్మణాది సృష్టినెటులె గ్రహింపుఁడు. కనుక దుర్బలులమగు మనతో పరమాత్మను బోల్పఁగూడదు. శరీరేంద్రియాదుల నపేక్షించకయే భూగోళాదుల రచించినట్లు అచింత్యరచనాశక్తిగల పరమాత్మ మాయామయమగు తనశరీరములోని మొగంబునుండి బ్రాహ్మణస్త్రీపురుషులను ఇటులనే ఆయాఅవయవములనుండి ఆయావర్ణదంపతుల సృజించెనన నేమివింత, మనతో సమమగు శక్తియే గలుగునెడల దేవుఁడెట్టులగును? కాన సృష్ట్యాదినుండియు వర్ణవిభాగంబులు వచ్చుచున్నయవియే. సృష్టిప్రళయప్రవాహం బనాదిగావున ననాదికాలంబునుండియు నీవిభాగంబు గలదు. ద్వీపాంతరంబులలోన నీవిభాగంబుండినట్లు విష్ణుపురాణము బోధించుచున్నయది. జనుల దురదృష్టము వలనను ప్రమాదమువలనను నిటీవల నది నశించి యుండఁబోవు.

మన నవనాగరికుల యుద్యమంబులే ఫలించునెడల కొన్ని వేల సంవత్సరములు గడచినవెనుక భరతఖండమునఁగూడ నీభేద మెన్నఁడును లేదని యప్పటి కాలపువారలనుకొనవచ్చును. కావున నోహూణభాషాభ్యాసులగు విద్యార్థులారా! ఓహూణభాషాభిజ్ఞులగు హైందవపండితులారా! మనలను వర్ణభేదమే లేకుండ పంచములలో గలిపి పశుసమముల జేసి మనఘనతను పరమార్థవిజ్ఞానమును మంటగలప సమకట్టి తాము చెడి యొరులఁ జెరుపఁబూను వేదవేదాంగానభిజ్ఞులగు వారలబూటకపు మాటలకు లోనుగాక శ్లో॥ సంకరోనరకాయైవ కులఘ్నానాంకులస్యచ॥ యను లోకాచార్యులును సకలజగన్నిర్మాతయునగు శ్రీకృష్ణపరమాత్మ యుపదేశించిన గీతావాక్యముతో నేకీభవించి వర్ణాశ్రమధర్మనిష్ఠులై వర్తిల్లుఁడు. ఇంకగొన్ని సంగతుల నాయీయుపన్యాసముల ద్వారా ప్రకటింతుము. తమకిట్టి దృఢసంకల్పములు నెలకొల్పి మేలొనగూర్చుటకై సర్వశక్తులుగల పరమేశుఁ బ్రార్థించుచు నీవ్యాసము ముగించుచున్నవాఁడను.

బ్రాహ్మణులు కోమట్లు వెళ్ళలేదు. కంసలబత్తులచేత ప్రతిష్ఠచేయించినారని వెళ్ళలేదు. నేను కమ్మరులస్తుడను. కంసలబత్తుల అన్నము తురకలుతప్ప యెవరు తినరు. ఆ రాఘ్యని తెచ్చి ప్రతిష్ఠచేయించినప్పుడు అంకణ రు 1-0-0, రు 0-8-0 లు వేసికొని రు 200-0-0 లు ఖర్చుఅయినది. కంసలివారు ప్రతిష్ఠచేసినప్పుడు ఖర్చు మునసబ్ పెద్దకాపు పెట్టుకున్నారు. నేను యేమి యివ్వలేదు. ప్రతివాదులను, కంసలబత్తులు వడ్లబత్తులు, కమ్మరబత్తులు అని పిలుస్తాము.

క్రాసు — జానపాటి వెంకటప్పయ్య వానిఅన్న, వానిఅన్నమీదవచ్చిన సత్తు రూపాయల కేసులో నేను ఆయనతరపు సాక్ష్యముపలకలేదు. నాన్న, నామామన్న, జరిగిన వ్యాజ్యములో వెంకటప్పయ్య నాతరఫున పనిచేయలేదు. ఆయనకు నేను పొలము యివ్వలేదు. రావెల రామచంద్రయ్య వెంకటప్పయ్యమీద తెచ్చిన ఫోర్జరీకేసులో నేను సాక్ష్యము చెప్పలేదు. వల్లమూడి కోటయ్యకు వెంకటప్పయ్యకు జరిగినక్రిమినల్ కేసులో సాక్ష్యముపలుకలేదు. 2 వ ప్రతిష్టకు యెల్లాప్రైకము వసూలుచేసినది నాకు తెలియదు. ప్రతిష్ఠచేసినపోటికి తోలుమూరు పోయినాను. రెండవసారి పోలేదు. ప్రతిష్ఠచేయబోతే వద్దని చెప్పటమునకు పోయినాను. మేముచేయించేది అంతే అంటే వెళ్ళి వచ్చినాము. నేను వెళ్ళినది పాతపాటమ్మ దేవాలయము దగ్గరకు ప్రతిష్ఠచేయకముందు 10 రోజులక్రింద వీరిని తెచ్చి ప్రతిష్ఠచేస్తారని తెలిసినది. స్ఫోటకపుదేవతకు మేము పోతేరమ్మ పోసినదని చెప్పుతాము. నేను మొదటిసారి వెళ్ళివచ్చేవరకు విగ్రహములను బావిలో స్నానముచేయిస్తున్నారు. బత్తులు చేయించేటప్పుడు బ్రాహ్మణులు చేసినదేగదా. మళ్ళీయెందుకుచేయించవలసివచ్చినదనిఅంటే బ్రాహ్మణులుచేయడంబాగాలేదు. బత్తులచేతచేయిస్తాము అని అన్నారు దేవతక్రింద వేసిన బంగారుబిళ్ళవిషయమై యేమి తగాదాలురాలేదు. కుమ్మరవాడు ఒకడు గుడ్లోవుంటాడు, గొల్లవాడు అలంకారములు చేసి పూజచేస్తాడు. బోనాలు తీసుకపోయి నైవేద్యములు పెట్టి అక్కడపెట్టితే పని పాటలవాండ్లు తీసుకుంటారు. మొదటికొల్పులు అయినతర్వాత తిరిగిప్రతివాదులుచేసే వరకు మధ్యసంప్రోక్షణజరుగలేదు. మామూలుగా పోతేరమ్మగుడికి పాతపాటమ్మగుడికి గొల్లవాడు పూజచేయడం అలంకారముచేయడం.

మొదటికొల్పులకు బ్రాహ్మణులు నైవేద్యాలుతెచ్చి దణ్ణములుపెట్టి పనిపాటల వాండ్ల గుడ్డలలో వేస్తారు. ఒక్కొక్కతెగవారు ఒక్కొక్కమాటు నైవేద్యం తీసుకొనిపోతారు. కంసాలీలయిండ్లలో యేజాతివారు భోజనముచేయగా నేను చూడలేదు.

మా వూళ్ళో జానపాటి పురుషోత్తం, చినప్పయ్య, సుబ్బయ్య, పౌరోహితం చేస్తారు. చాకలి, మంగలి, కుమ్మరి యిండ్లలో యీబ్రాహ్మలే చేయించడం. చేయించినందుకు మేము యేమైనయిస్తాము. వాడితండ్రి మాయిండ్లలో పౌరోహిత్యం చేయించేది. ప్రతివాదులు మాయిండ్లలో భోజనముచేయరు.....కూరపాటి పెదవెంకయ్య నిశాని...

......1-9-1911......కొత్త కోటయ్య...జానపాడు.

నేను కోమటిని. నేను ప్రతివాదులను యెరుగుదును. వారిని మేము కంసలబత్తులు అని పిలుస్తాము. కంసాలియిండ్లలో మాకులమువారము భోజనముచేయము.

క్రాసు బ్రాహ్మణయిండ్లలోను కరణములయిండ్లలోను తప్ప మాకులమువారము యితరయిండ్లలో భోజనముచేయము. కంసలయిండ్లలో మాకులములో యెవరైనభోజనముచేస్తే మేము మాయింటికి రానియ్యము. కరణాలుఅనగా నియోగులు.........

కొత్త కోటయ్య వ్రాలు...

...1-9-1911.. తాడువాయి కోటయ్య, తెలగ, జానపాడు.

ప్రతివాదులు కంసలకులస్థులు. ప్రతివాదుల కులస్థులయిండ్లలో భోజనము చేయము. అట్లా భోజనము యెవరైనా చేస్తే మేము వారిని మాకులములోనికి రానివ్వము.

క్రాసు. ప్రతివాదులు మాయిండ్లలో భోజనము చేయరు. మంచినీళ్లుతాగరు. యితరవూళ్ళసంగతి నాకు తెలియదు...తాడువాయి కోటయ్యనిశాని...

...1-9-1911...గొబ్బి నాగన్న...యర్రగొల్ల, జానపాడు.

ప్రతివాదులు కంసాలివారు. మేము వారియిండ్లలో భోజనముచేయము. నీళ్లు తాగము. మాకులములో యెవరైన వారికులములో భోజనముచేస్తే మాకులములోకి రానివ్వము.

క్రాసు యితరవూళ్ళ మామూలుసంగతి నాకు తెలియదు. కంసాలీలలోమాలో యెవరికివారమే యెక్కువ...గొబ్బి నాగన్న నిశాని...

...1-9-1911...బొమ్మిరెడ్డి వీరాస్వామి...చాకలి...(మున్సిఫుగారి) నౌకరి ...గుంటూరు.

నేను చాకలివాడను. ప్రతివాదులు కంసాలీలు. మేము కంసాలీలయిండ్లలో భోజనముచేయము. ప్రతివాదుల కులము వారియిండ్లలో యెవరయినా భోజనముచేస్తే మాకులములోనికి రానివ్వము- క్రాసు,—మేము చాకలిజాతికిపుట్టినవాండ్లము. మాలో కంసాలివారిలో యెవరికులమునకు వారికియెక్కువ. మాకంటె బ్రాహ్మణులు యెక్కువ. కంసాలీలు మాకంటె యెక్కువజాతిఅనిచెప్పలేను...బొమ్మిరెడ్డి వీరాస్వామి నిశాని...

తే॥ కాని పైసాక్ష్యమునకె నాగ్లేనుదినము
లగుచు విసుగెత్తియుంట ధర్మాధికారి
హెచ్చువిషయంబులడుగుట కిష్టపడక
తొందరించెను మాకెటు తోఁపకుండ॥ 100

ఉ॥ ఈవిధిఁ దొందరించుటను నేవ్రు కలాదులయిండ్ల భోజనుల్
జీవన మన్నముల్ గ్రహణసేయని యావిషయంబె వచ్చెఁగా
నీ విదితంబుకాదుకదు నేఁ మఱికొందఱు సప్రతిష్ఠలన్
వారిరినడ్డగించుటయుఁ బాపలుగొల్చుటయుం దదర్చులన్. 101

క॥ రథకారుల యన్నమునీ
శ్ళధములునుంగొననియట్టి యవ్విషయంబా
* యధికారి సేవకాదులు
ప్రధితంబుగఁ జెప్పిరంతఁ బ్రశ్నముసేయన్॥ 102

---

*...1-9-1911...కావూరి సుబ్బడు,...యానాది...(మున్సీభుగారి) గుర్రపు నవుకరు...నెల్లూరు, హాలుమకాం గుంటూరు

నేను కంసాలిజాతినియెరుగుదును. వారు వడ్లపని కమ్మరపని బంగారపుపని చేస్తారు. కంసాలివారియిండ్లలో మేము భోజనముచేయము. మాలో యెవరయినా కంసాలివారియిండ్లలో భోజనముచేస్తే వారిని మాకులములోనికి రానివ్వము.

క్రాసు—డక్కలవాడు మాలవాడు మేము యితరజాతివాండ్లను పెండ్లిచేసుకోము. మేము యానాదులకు పుట్టినవాండ్లమే డక్కలివాండ్లు బ్రాహ్మణ యిండ్లలో తినరు...కావూరు సుబ్బడు నిశాని...

...1-9-1911...అన్నంగి నారాయుడు...మంగలి...అంకిరెడ్డిపాలెము.

నేను కంసాలిజాతిని యెరుగుదును వారు బంగారపుపనినాగళ్ళుచేస్తారు. మేము వారిఅన్నము తినము మాజాతిలో యెవరైన కంసాలజాతిఅన్నముతింటే మాజాతిలోనికి రానివ్వము.

క్రాసు—మాకులము మొదట యెట్లాపుట్టినది చెప్పలేను. నేనుయెరిగినంతలెక్క మంగలీలు కంసాలీలయిండ్లలో భోజనము చేయరు...అన్నంగి నారాయుడు నిశాని...

ఆ॥ దివసషట్కమిట్లు తపిలి విచారించి
వాయిదావిధించె న్యాయకర్త
అది కలాదజనుల కనుకూలమయ్యెఁబో
పెక్కుపనులు చక్కఁబెట్టుకొనఁగ॥ 103

గద్య

ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్షసంప్రాప్తకవితాసాహిత్య నిధానహారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికాతనూభవ గర్భశుక్తిముక్తాయమాన విద్వత్సభావిష్కృతావధానవిధాన జానపాటిపట్టాభిరామాభిధానవిలిఖితం బగు స్వర్ణకారవ్యవహారమందుఁ ద్వితీయభాగము.

---

 పరా:—ఇంతవఱకు ప్రచురింపఁబడిన సాక్ష్యములు తెనుఁగున వ్రాయఁబడియుండుటచేఁ గోర్టులోని నకళ్లననుసరించి ప్రచురింపఁబడినవి. వ్యాకరణశుద్ధములు కాకుండుట కిదియే కారణము, ఇఁక మీఁదవచ్చెడిసాక్ష్యము లింగ్లీషున వ్రాయఁబడి యుండుటచే వానిఁ దెనుగు చేసికొని వ్యాకరణశుద్ధముగాఁ బ్రచురింపఁబడుచుండును.

...6-11-1911...ఇంకొల్లు రంగనాయికి...బోగముది...గుంటూరు.

నేను గమసాలకులము నెఱుఁగుదును. వాండ్రునగలు చేతురు. కొంతమంది వడ్రంగము కొంతమంది కమ్మరముచేతురు. వాండ్రయిండ్లలో మేము భోజనముచేయము.

క్రాసు—నాకు భూములున్నవి. నేను వైదికుల నెఱుఁగుదును వాండ్రుమా యిండ్లకువచ్చి తద్దినములప్పుడు సంభావనతీసుకొందురు నే నెఱిఁగినంతవరకు మాకులసులు కమసాలవాండ్రయిండ్లలో భోజనముచేయరు...

...6-11-1911...గొట్టిముక్కల ముత్తాయ...మాల...గుంటూరు,

నేను గమసాల కమ్మర వడ్రంగుల నెఱుఁగుదును. వారియిండ్లలో మాకులస్థులు భోజనముచేయరు ఎవరైన వారియిండ్లలో భోజనముచేసినట్లయితే మాకులమునుండి వెలివేతుము.

క్రాసు—డక్కలవాండ్రు మాదిగలకంటె హీనజాతివారు. వాండ్రు బ్రాహ్మణుల గృహములందు భోజనముచేయునది లేనిది నాకుఁదెలియదు...

తే॥ అమరనిమ్నగ స్వర్లోకమాక్రమించె
నాత్మభూరిప్రభావత నవనిభువన
మాక్రమించెద నేనని యమున నిండు
కొనినకై వడి చీఁకటుల్ మొనసెదిశల. 174

తే॥ నిర్మలదిశానుభూతసస్నేహవిభవ
కలితభూరి తమోనిరాకరణసుప్ర
భావములఁ గులదీపముల్ పరఁగెఁజాల
నోజఁ గులటీపములకిది నైజమెకద. 175

సీ॥ ఘనపయోధరపూర్ణ కలశాంతరములకు
రమణీయ నీలహారములుగాఁగ
శకలితశశిబింబ చారుఫాలములకుఁ
గస్తూరికా తిలకములుగాఁగ
సచిరరుక్ప్రచుర సద్రుచిరాంగకములకు
లాలితాసిత నిచోళములుగాఁగ
శతపత్రవరపత్ర జైత్రాంబకములకుఁ
గజ్జలసార పంకములుగాఁగ
నీలకబరీభరముల కిందీవరప్ర
ధామములుగాఁగ గాఢ సంతమసవిభవ
మభినవాలంక్రియలొసంగ నపుడుజార
కీరవాణులుచనిరి సంకేతములకు. 176

మ॥ చరణన్యాసముగూఢమైయలర రాజద్వ(ల్గు)లీలాగతు
ల్బెరయన్ మెల్లననిల్చినిల్చిరోద లోలింబొంచియాలించుచు
న్నిరముల్ వంచుకసందులందణఁగుచున్ నిద్రారతిఁజారులే
గిరితద్వేశభుజంగసంజ్ఞతగి సంకేతస్థలుల్ చేరఁగన్. 177

సీ॥ క(రరు)హారేఖలు గనుపట్టకుండమే
లొక్కమరుచన్నులువ్రేళ్ళ నిమురుమనుచు

పలుకెంపుతెలమి నేర్పడకుండసొంపుమై
నధరామృతంబును నానుమనుచు
మందాక్షరములుగా మణితముల్ మెల్లనఁ
జెలువంపుపీనులఁ జేర్పుమనుచు
సునసితంబాఘాత నినదముల్ ప్రకటంబు
గాకుండఁదిన్నగఁ గలయుమనుచు
జారిణీతతిసంకేత సదనమదన
కదనసమయ (సముత్సాహ) గాఢరూఢ
చటులసంరంభగంభీర జారకోటిఁ
బలుకుఁదమజాడపరుల కేర్పడకయుండ॥ 178

కం॥ అంత శచీకాంతదిశా। కాంత నిశాకాంతపూర్ణగర్భాంతరమై
వింతహరువొందమోమున। తాంతేరవిభవలీలధవళిమదోఁచెన్॥ 179

వ॥ అయ్యెడ 180

ఉ॥ తమ్ములపాలిగొంగ కుముదమ్ములచక్కిలిగింత చక్రవా
కమ్ములగుండెతల్లడము కైటభవైరిమఱంది దేవబృం
దమ్ములపారణమ్ము హరినందనుకూరిమిమామ యచ్ఛకో
రమ్ములజీవనౌషధము రాజుదయించెను దూర్పుదిక్కునన్॥ 181

సీ॥ సౌగంధికాననాభోగసంపత్కారి
తోయజశ్రీపశ్యతోహరుండు
మంజుజీవంజీవ సంజీవనౌషధం
బంధకారసమిత్కబంధయోని
జారచోరచ్ఛటా సంభ్రమప్రతిపాది
మదవిహంగరథాంగ హృదయభేది
పటుమహానటజటాపటలస్ఫుటసుమంబు
స్మరశౌర్యహుతవహ సామిధేని

పాంథసంతాన మానశంబరసిధాన
మథనమంథానశిఖరి రమాహృదీశ
సత్యనేత్రాంగ మురుకళాజననసీమ
చందమామ వెలింగెఁ బ్రాక్శైలమందు ॥ 182

వ॥ అయ్యవసరంబున 183

తే॥ వసదమార్గంబు పెంపారె వనముభంగి
తారకంబులు విలసిల్లెఁ గోరకముల
విమలగతి రాజమానమై కమలవైరి
బింబ మొప్పారె వికచపుష్పం బనంగ. 184

సీ॥ సకలపదార్థౌఘసద్గ్రంథటీక చ
క్రశ్రీమృణాళికా రాజహంసి
నిర్ధనిక్రియా నిశ్చలదీపిక
స్మరశౌర్యహావ్యభుక్సామిధేని
జారచోరచ్ఛటాచరణవల్లిమతల్లి
పాంథదర్పారణ్యపరశుధార
తప్తచకోరకాధ్వన్యప్రపాసీమ
దంపతినిధువనతంత్రఘుటిక
భూరిశీతలసార కర్పూరకదళి
తోయజవికాసవిద్యాప్రదోషవేళ
భవ్యకైరవహార్దాబ్ధి పౌర్ణమాసి
పండువెన్నెల కన్నులపండువయ్యె. 185

వ॥ వెండియుఁ బుండరీకశాత్రవమండలంబున సఖండంబుగఁ బ్రభవించుపండువెన్నెలచండమదోద్దండాఖండలశుండాలశుండాదండోద్ధూత రంగ ద్వియద్గంగాతరంగిణీసముత్తుంగతరంగపుష్కరపూరంబు వైఖరి, మేఘద్వారఘనసారరసాజాతసంజాతరజః పటలంబుపోలువున, నంధకారజగద్బాంధవకుమారికాప్రభేదనసమయ పూర్వగీర్వాణాభి

యాత్యుగ్రజాతవిగ్రహ ప్రభాపుంజంబు చందంబున, సుధాధామసందర్శనామంద కౌతూహలాభ్రంక షోద్వేలాయాత పయఃపారావార వీచికాసంఘాతంబు భాతి, నాళీకప్రభూతకలాద బ్రహ్మాండకరండసాంద్రీకృత కలధౌతమయనీరపూరంబు క్రియ, లోకంబులెల్లసిండి ప్రథమధరాధరాధిత్యకాభాగాభోగ సుందరలతా మందిరాళింద కేళీవిహారణపరాయణ పుళిందమిళిందాలకాలోక ధమ్మిల్ల వేల్లనాతిఝుల్ల కౌత్సుల్లవనమల్లికలకు నల్లిబిల్లియై వారలొకానొక కాలంబునందమకు నాటపట్టులగుసవిధ వివిధపర్ణకుటీరమ్ముల గండకండూభరమ్ములందీఱ నొరసికొని కాండవిహారంబునకై గండుమెఱసి నడగొండలవడువున బారులుతీరి సెలయేరులకేగు భద్రవేదండ వరాహప్రకాండమ్ములరాకలుం దదఖండపుండరీక భవాండభాండవిచండిల చండఘీంకారఘుర్ఘురనిర్ఘోషంబుల నెఱింగి యమర్షోత్కర్షమ్ముల మృదుతరకరకాండజాతమ్ములం గోదండమ్ములెక్కిడి సంవర్తపుష్కలావర్తజీమూతసంఘాతస్ఫురితనిర్ఘాత చ్ఛటాఘోరంబులగు శబ్దభేదిశరాసారంబు లపారసారవిచిత్ర నిపుణతాధౌరేయంబులుకన్పడం దొరంగించి వేత్రదండఖండనాపూర్వకంబుగాం దదీయశుంభత్కుంభవిషాణనిర్దళనంబు గావించినం బెల్లుగా జల్లుజల్లునరాలు చిత్తరంపుం గ్రొత్తముత్తియంపురాలతోం బొత్తుహత్తించి గుహాకుహరముహుర్ముహురుత్సాహ నర్మనిగూహనాన్యోన్యాన్వేషణక్రియాస్తంభనంబులుసంభవించిన బహిర్నిర్గతలై తమలోం బొత్తెంబులేనిమచ్చికల నిచ్చలు రచ్చలు సేయు మెచ్చువచ్చు నచ్చుపచ్చరాలచ్చుటచ్చటనమర్చిన మృగాంకశిలావితర్ది కావిటంకంబుల నకలంకవిలాసంబుల నాసినలై నిరంకుశశుషాంక బిరుదాంక సంకలితహృదయంగమాభంగ మాంగళ్యశృంగారరసతరంగ రంగత్సంగీతభంగులం జెలంగు నయ్యారంగులచెలంగులు కరంగి తెలిసీరు జలజలనుదొరంగ మదీయ హృద్యానవద్య గానవిద్యావిశేషంబుల ద్రుతంబులయ్యెనని ప్రాణవల్లభుల నుల్లసంబులాడు ముగుదలగు యక్షపక్ష్మలాక్షుల నిగనిగనిగ

జిగిబిగి వెలిత్రోఁగ తెగల మిగులనగునగవులీను కటాక్షవీక్షాప్రకాశధాళ
ధళ్యప్రభాధట్టంబునకుఁ జుట్టంబై నిర్నిరోధంబగుతారాపథఘంటాప
థంబున నష్టాపదప్రభాభాసమానంబులగు విమానంబు లెక్కి యుత్ఫుల్ల
కోల్లోలకల్లోలహల్లీసకసల్లలిత వియత్కల్లోలినీమతల్లికోత్ఫుల్లహల్లకవ
నీసదనంబుల మదనకదనంబుల సదమదంబులై మోదము లెదలఁబొదల
విహరించు వళక్షపక్షమిథున పక్షవిక్షేపణసముద్ధూత శీతవాతపోత
ముల బడలిక లెడల వేడుక కాండ్రఁగూడి క్రీడించు ప్రోడలగు తెరగం
టి తెలిగంటిమిన్నల చెన్నుగల కడవన్నెగుబ్బలియుబ్బుగబ్బు
గబ్బిసిబ్బెంపు నిబ్బరంపుగుబ్బల నందందఁ దనరు వెలయెక్కు
డుమగరాలసరులసిరులతోఁ బోరలు లేనిమురులున ననంగిపెనంగి క్షీర
నీరనిధానాంతర నిరంతరానంత కాంతిదంతురానూన ఫేనసాంద్రచం
ద్ర శిలాచంద్రశాలాప్రదేశ ఖేలా విహారలీలాలోలకీలాల బాలాజాలాం
గకమ్ములకు సొమ్ములై చూపట్టు లేతమ్మితూఁడులకు సైదోడ్లై,
యేలా చామంతికా వాసంతికా మల్లికా వల్లికా మతల్లికా కేళికా
డోలికామాలికలఁ గిన్నరబాలికాపాళికలతో జోడులుకూడి వేడుకల
నూఁగియూఁగి చిత్తంబులఁ దృప్తింజెంది కంటివింటిదంట దిట్టతనంబు
నఁ గట్టాయితంబై తుంటవింట వెన్నంటు కంటకంబున నేయువిరిశరము
లెఱికలఁ జుఱుకుచుఱుక్కున నాట నటనిలువనోపక సమీపమ్ముల
నిమ్ములై నిండారవిరిసిన బొండుమల్లియలఁ దండోపతండంబులుగా
మెండుకొసిన గండుతుమ్మెదల గరుజ్జాతనురుజ్జాతమ్ముల సించుకదలు
పూవుపొదల సతాంతలతాంతకల్పితా నల్పతల్పభాగంబులనుల్లసిల్లు
ప్రాణవల్లభుల నుల్లంబులఁ ఉల్లసింపంజేసి యా భోగానురాగంబు లెచ్చ
వా తెఱజుంటితేనియసంటు మొనపంటు సగంబుకొఱికి సొంపుమెఱయు
నొసంగు కింపురుషచంపకామోదల చేతి తెలినాకుమడుపులవడుపున
బెడంగుగాంచి కేళీసౌధచంద్రశాలాంతర హంసతూలికాతల్పంబులం
గూర్చుండి మధురమధురసమ్ములు తమకన్న నామ్రేడితంబులుగా

నొసంగి మదజృంభణంబులురెట్టింప జంటముత్తియంపుఁ గుట్టుపనికంచు కంబులముళ్లు సళ్లించి ప్రతిమాఁలిన బయలుపడంజేయని యబ్బురంపు గుబ్బచన్నులు చినికివాడు కొనగోళ్ల గ్రుచ్చియు నివాఁడనని వేఁడుకొనిన మొనపంటనంటనీయని చక్కెరకెమ్మోవులు గంటులుగావించియుఁ ప్రార్థించిన నాదరంబునవినని శ్రవణపుటంబుల నిచ్చవచ్చినట్లు సచ్చెం బుగాఁ బచ్చిదేరుపలుకులు సొనిపియు నవుగులపయింబడి మ్రొక్కిన నించుకంతయు మెత్తవడినచిత్తంబులఁ బోఁకముడివొసంగని జిలుఁగు తెలిచల్వపైఠిణీవలువలు సడలించి యతిగాఢపారిసధ్వజాయోధనమ్ము లఁ గలంచియు మద్యం బాత్మప్రాణత్రాణపరాయణత్వంబు భజించె నాసవనామంబు దీనికిఁ జెల్లు నని యుల్లంబుల సంతసిల్లు భుజంగులతో నెట్టకేలకు సౌఖ్యతక్క యలుకవొడమినచిత్త మ్ముల మొగమ్ములుద్రిప్పిమాటాడక యీతప్పు సైరింపుమని మంద మందభాషణంబులుగాఁ బలికి మ్రొక్కినఁ గెరలి తాడనంబుగావించు లేఁబ్రాయంపు వెలమించుబోఁడుల చరణనఖరకాంతులపై దొంతరలు గొని దంభోళిధరకుంభినిధరపయోధరీపయోధరరుచిరుచిరకచభరాబ ద్ధస్నిగ్ధసుందరమందార వికచప్రసూనమాలికలకుఁ బోలికలువాటించి వీతిహోత్రశతపత్రనేత్రీ కర్ణపత్రవిచిత్రహీంగోపలచ్ఛవిచ్ఛటాప్రకాశం బులకుఁ బ్రతీకాశంబై కృతాంతశుద్ధాంతసీమంతినీకాంతసీమంతముక్తా మణీరామణీయకంబులతో వియ్యంబుగైకొని రక్షోధ్యక్షపక్ష్మలేక్షణా తిలకాళికఫలకఘున సారతిలకంబుతోఁ జెలువంబుఁ బూని సింధునాయ కనాయికావతంసకర్ణావతంసకైరవ ప్రభాశ్రీలతో మేలంబువాటించి గంధవహగంధసింధురగామినీగంధసారచర్చావిలాసంబుతో సౌమన స్యంబుప్రకటించి రాజరాజావరోధ రాజముఖీకరాంభోజరాజన్మణిము కురబింబంబునకుఁ బ్రతిబింబంబై యంతకాంతకాంతఃపురకాంతామణికు చోపరిఘటిత ధవళచేలాంచల కంచుకంబులతోఁ దులదూఁగి సర్వసర్వం సహాధరంబులకు శర్వసర్వంసహాధర విభవంబు భసంబు నొందించి

సర్వద్వీపంబులకు శ్వేతద్వీపత్వంబు ఘటించి సర్వయోషాజనంబులకు భాషాయోషా విశేషంబుఁ జెందించి యొప్పారె, అప్పు డప్పేను రేయెం డతాఁకున కోర్వక బెండుపడి గుండియ చెదరియున్న యయ్యండజపరి వృఢధ్వజకుమారిం గనుంగొని మెఱుంగుబోఁడుల కలకలంబు వారించి యొక్క ప్రోఁడయగు కురంగనయన సారంగాంకు దిక్కు మొగంబై విన యవినయవాక్యంబుల నిట్లనియె, 186

— * చంద్రదూషణ * —

సీ॥ "ద్విజరాజవయ్యు నందీ ప్తశుచిస్ఫూర్తి
సరసకళావిలాసంబుఁ గంటి
గురులీల సర్వజ్ఞవరశిఖామణివయ్యు
విగతతమోగుణవిస్ఫూర్తిఁ గంటి
అనుపమభవ్యలక్ష్మణలక్షితుఁడవయ్యుఁ
బంకజాతవిదూరపదవిఁ గంటి
సన్మార్గసంచారచారుశీలుఁడవయ్యుఁ
గువలయాకలితవైభవము గంటి
అహాహా! యిటువంటిఘనుఁడవై యనపరాధి
నబల దుఃఖింపఁ జేయుట న్యాయమటర
నయతఁ "బాపాయ పరపీడనం" బటన్న
సరసవచనంబు మఱచితే చందమామ! 187

సీ॥ విలసితశ్రీవత్స కలితాభ్యుదయ మొంది
యరిధరకరలీల నందగించి
సారంగరక్షణోజ్జ్వలవిభూతి వహించి
బుధగురువై భవస్ఫూర్తిఁ గాంచి
అతులితలక్షణాంచితవిశేషముఁ బూని
నీలాంబరవిహారనియతిఁ దాల్చి

అర్జునవరవిగ్రహస్థితి నెసఁగి స
ద్బృందావనమనోజ్ఞవృత్తిఁ జెలఁగి
విధుఁడవై యించుకయును సాత్వికము లేక
అకట! దాక్షాయణీప్రియవ్యాప్తిఁబూని
సోమవిఖ్యాతిఁ జెంది తమోమయాత్మ
కుఁడవుగా నేలచంద్ర! సద్గుణమెపూను. 188

తే॥ మకరకేతనుపైఁగృప మరలకుండు
టల్లుఁడనికాదె, మాచెలి యరసిచూడ
ననుఁగుకోడలు నీకగు, నకట! యింత
నిర్దయత నేఁచఁ బాడియే నీరజారి! 189

క॥ హరిణాంక! మృగుద నయ్యో!
హరిహరి! హింసింపఁజూచు టదిధర్మము గా
దెఱుఁగవె యాత్మ "నహింసా
పరమోధర్మ"యనుపలుకు ప్రాజ్ఞులుపలుకన్॥ 190

వ॥ అనిపలికి కలికికలువలచెలి కానిచలన లలనవలవంత యావంతయు శాంతిగాకుండుటయెఱింగి యంతరంగంబునం దురంగలించు గోషావేశంబున నుపాలంభంబుగా నిట్లనియె॥ 191

ఉ॥ ప్రల్లదమాడెనే భువనబాంధవుఁజోక నెసంగియున్న నీ
కల్లవియోగులందు జలజారి! విరోధముపీడలేదు మేల్
తొల్లిఁటినీదునైజమది దూరముగాఁజన నెట్లునేర్చు, హా!
పుల్లలతోడఁగాక తగఁ బుట్టిననాఁటిగుణంబుపోవునే॥ 192

మ॥ స్ఫుటపాదైకగతిన్ మహానటజటాజూటాటవీవాటిలోఁ
బటుఫాలానలభీమధూమపటలీ పానంబుగావింపు చు
త్కటగంగాతటినీసమీపమునఁ జంద్రా! బాల్యమందే తపం
బటుగావింపవె కామినీహననకార్యాకాంక్షివై ధీరతన్॥ 193

అని శాస్త్రిగారి గ్రంథము కనఁబడుచున్నది. పంచాయతనపూజాప్రతిపాదకమగు, శ్లో॥ ఆదిత్యమంబికాంవిష్ణుమనుస్మృతికిఁ బరాశరమాధవీయమందు నామనిర్దేశము చేయకపోవుటచేఁ దావన్మాత్రద్రష్టకనామధేయత్వమే సిద్ధమగును. రెండుమూడుగ్రంథములు చూచినప్పుడుగాని వానినామము స్పష్టముకాఁజాలదు. అది పూర్వమునే నుదాహరించియే యుంటిని. తాదృశస్మృతికనామధేయత్వముచెప్పెడివాఁడు పంచదేవతారాధనయందలి ప్రద్వేషముచేఁ దత్ప్రతిపాదకస్మృతులయందును మత్ప్రతికూలమగుస్మృతి లోకమునం దేలయుండవలెనని ద్వేషించుచున్నట్లు తోఁచెడిని. లోకమందాచరింపఁబడు నీ పంచదేవతాపూజ పంచప్రాణపూజారూపము కాదు. అది శామశాస్త్రిగారి భ్రాంతియే. ఒకవేళనటులైనచో నప్పుడక్కడ నాచారవిచార మవసరమో యనవసరమో కాని ప్రకృతిమద్దానితో ననవసరము, కేవల పంచదేవతారాధనమందుఁగూడ నాచారవిచారనిరూపణావసరము లేదనియే శాస్త్రిగారియాశయ మైయుండవచ్చును. అదియు నిజమే సదాచారభూతమగు పంచదేవతారాధనమునం దాచారవిచారావసరము లేదు. ఎక్కడసందేహమో యక్కడనేవిచారావసరము. ఇది యందఱెఱింగిన విషయమును నన్నివేళల నన్నిదేశముల వాడుకలో నుండునదియునైయున్నది. తరువాత

అవుగాక-కొంద ఱుపపాదిత శ్రీమత్పరాశరోక్తాగ్నౌక్రియావతాందేవమొదలగువానిచే నగ్నియందే దేవపూజ కర్తవ్యమని యభిప్రాయపడుచున్నవారు, ఆప్రకార మభిషేకాది షోడశోపచారము లగ్నియందు యథాప్రకారముగఁ జేయుటకు సందర్భముకలుగదు అట్లుకానిచోఁ దత్కర్మపూరణమందలిమార్గము మృగ్యమగును. బాహ్యము-పూర్వోక్తదేవపూజ పాపక్షయార్థమైప్రాప్తములగు సర్వకర్మలలో నొకటిగాఁ బరిగణింపఁబడినను నది యాత్మప్రాప్త్యుపాయరూపజ్ఞానమున కుపకారకముగుట సర్వోత్తమమని యెఱుంగవలె, కనుకనే పంచప్రాణరూపదేవపూజ బహిర్వేదికయందాచరింపఁబడదు. అభిషేకాదివ్యవహారమయినను నాచరింపఁబడదు. అగ్నియందాచరింపవలెనని యనువాదముచేసినంతనే ప్రమాణములేకుండుటం జేసి శ్రౌతస్మార్తాగ్నియం దొకటిఁ జేయవలయునదని యెవఁడును నిర్ణయింపశక్తుఁడుకాఁడు. అప్పు డచ

టం జెప్పంబడిన యగ్నిశబ్దమునకుఁ బ్రాణాగ్నియని భావించుకొనవలె కానిచో మంచి మార్గము దొరకదు. ఆకర్మ నిత్యము ప్రాణాగ్నిహోత్రమం దాచరించుటచే సులభముగఁ గుదిరిపోవుచున్నది. ఈప్రకారము యథోక్తకర్మాధికృతులగు విప్రాదిత్రైవర్ణికులకుఁ బ్రతిమార్చనచెప్పుటకు స్వప్నమందుఁగూడ నెప్పటికిని నెవ్వఁడును శక్తుఁడుకాఁడు.

అని శాస్త్రిగారు సెలవిచ్చిరి. అగ్నౌక్రియావతాం దేవయను చోట స్మర్యమాణమగు సగ్న్యాధారక దేవపూజ కభిషేకాద్యుపచారములు సంభవింపవఁట- అక్కడ నభిషేకాదుల ప్రసక్తి లేదు. స్థానభేదముచే నుపచారములు సమన్వయింపఁబడును. స్థిరప్రతిమాదులయం దావాహనవిసర్జనము లెట్లు లేవో యగ్నిష్టోమాదికమందగు సోమపూజలో ధూపదీపాదిక మెట్లువర్తింపదో యట్లే యగ్నియందును నభిషేకాదిప్రసక్తి యుండదు. అగ్నియందు దేవపూజయన నచట హూయమానములగు హవిరాదులు పరమేశ్వరార్పణచేయుటయే "యజ్జుహోసిదదాసి" యనుగీతావాక్యమిం దనుసంధేయము- శాస్త్రిగారగ్నియందలి దేవపూజాస్వరూపము గుర్తెఱుంగకయే మాటిమాటికి శ్రౌతస్మార్తకర్మాధికృతులగు విప్రాదిత్రైవర్ణికులు మొదలగు వాక్యములుపనయనమాది యింతపర్యంత మవిచ్ఛిన్నోపాసనాదిక మాచరించువానివలె వ్రాయుచుండిరి. బలే! శ్రౌతస్మార్తకర్మనిష్ఠ చక్కఁగా వ్యాఖ్యానము చేయఁబడె-"పంచప్రాణరూపదేవపూజ బహిర్వేదికయం దెవఁడుచేయుచున్నాఁడు? ఏమనియాపూజ బహిర్వేదికయం దాచరింపవలె? అభిషేకాదివ్యవహారమైనను నెట్లువర్తించెడు?" అని తననీడ తాఁజూచుకొని భయపడువానిచందమున శాస్త్రిగారు వ్యర్థముగ ఖేదపడుచుండిరి. అగ్నౌకర్తవ్యయనునది యనువాదమైనచో దానికిఁ బురోవాదమేమిటి? అగ్నిపదముచే శ్రౌతాద్యగ్నిగ్రహణముచేయుటకు శాస్త్రిగారుదాహరించిన యగ్నౌక్రియావతామను వచనమే ప్రమాణము- శాస్త్రిగారు శ్రౌతస్మార్తాగ్నియం దొకటనసి యనిరి- ప్రాణాగ్నిందిగ్రహమందుమాత్రము మంచిమార్గ మెట్లుదొరకును? అక్కడ

నభిషేకాదివ్యవహారంబోప మెక్కడఁబోవునో? మఱియు, కుక్షింభరి ప్రాణాగ్నిహోత్రముచేఁ దత్కర్మ మెట్లుపూరించును? ఇదియునుం గాక ప్రాణాగ్నిహోత్రమాత్రముచే నందఱికిని బంచప్రాణదేవతోపాసనలభింపదు. ప్రకరణవశమునఁ బంచప్రాణ దేవతోపాసనయుపాసకులచే నై యున్నది- అతిథిభోజనమునకంటె ముందుభోజనము నాచమనోదకములయందు నాపోదృష్టియు నందుచే ననగ్నిత్వచింతనమును సర్వజీవభక్ష్యాన్నమందుఁ బ్రాణాన్నత్వభావనయు నెట్లుపాసకులకే యుండెడినో యట్లే ప్రాణాగ్నిహోత్రమందఱికర్మయు నుండును-ఇదియునుంగాక యుపాసకునకుఁ బ్రథమము ప్రాణాయస్వాహాయనియు ననంతరము వ్యానాయస్వాహాయనియుఁ దదనంతర మపానాయస్వాహాయనియుఁ దదనంతరము సమానాయస్వాహాయనియుఁ దదనంతరముదానాయస్వాహాయనియు నాహుతిక్రమము- సర్వసాధారణక్రమమేతద్విపరీతము- కావున నిత్యముఁ బ్రాణాగ్నిహోత్రకరణకాలమున ద్వారపాలకపంచప్రాణదేవతారాధన శ్రౌతస్మార్తకర్మాధికృతులగు విప్రాదిత్రైవర్ణికులకుఁ గోరకున్నను సంభవించుననుమాట కేవల కుక్షింభరిత్వనిష్ఠతనే తెలియఁజేయుచున్నది- శ్రౌతకర్మనిష్ఠతంగాని యేదేనొక యుపాసనయందలినిష్ఠంగాని తెలుపనేరదు. కనుక గురుసంప్రదాయ శూన్యులయొక్కయు నచ్చుపడినగ్రంథములున్నవను ధైర్యమున వానిఁజూచి యొరులకుఁ బాఠములుకూడఁ జెప్పువారియొక్కయు రీతి యంతట నిట్లే యుండెడిని-తాఁజెడ్డకోఁతి వనమెల్లఁజెఱచెనన్నట్లు తాము సన్మార్గమునుండిభ్రష్టులై పరుల వ్యామోహపెట్టుచు వాఙ్మాత్రముచే సన్మార్గనిష్ఠులవలె నటించుచు నితరులంగూడ భ్రష్టులంజేయుచున్నవారు. ఆహా! యేమి యీ బోధవైభవము- ఏవిధముననో ప్రాణాగ్ని హోత్రకరణముచేఁ బంచప్రాణోపాసనాలాభ మగుఁగాక-అంతమాత్రమునఁ బ్రతిమార్చనమం దేమి బాధకమువచ్చును?కలలోఁగూడఁ బ్రతిమార్చన మెవ్వఁడుం జేయఁజాలఁడనియుఁ బ్రాణాగ్నిహోత్రకారులకుఁ బ్రతిమార్చన తగదనియు

శ్రుతిగాని స్మృతిగాని యున్నదా? కావున నిదియంతయు నిరర్థకమే-చాలు-తరువాతి గ్రంథము

ఇదియునుంగాక గౌడపాదకారికలలోని వైతథ్యప్రకరణమున 529వ పుటయందు 23వ కారిక వ్యాఖ్యానావసరములో నానందగిరి మూర్తిశబ్దమునకు త్రిశూలధారియగు మహేశ్వరుఁడుగాని చక్రాదిధారియగు విష్ణువుగాని యగుదురని యాగమికులు చింతురు, అస్మదాదులశరీరమువలెఁ దచ్ఛరీరముగూడఁ బాంచభౌతికముగుటవలన నదియు భ్రాంతియే, విగ్రహమే లేనప్పుడు లీలగూడ లేదు నికిది లీలావిగ్రహకల్పనముకూడఁ దగదని యమూర్తమనియే చెప్పియుండెను.

అనియున్నది. ఆనందగిరియుదాహరించిన యాగమికాద్యుక్తి యెట్లు భ్రమసిద్ధమో యాగ్రంథభాగము స్వమతానుకూలమనుకొనుటయు నట్లే భ్రమసిద్ధము-నిజముగాఁ ద్రిశూలధారియున్నవాఁడని యాగమికులయభిప్రాయము. అట్టివాఁడు లేనేలేఁడని యానందగిరి యభిప్రాయము. కాని త్రిశూలాదిధారియగు మూర్తిలేదనికాదు-భక్తానుగ్రహార్థమై మాయామయమైనమూర్తి యుండనే యున్నది. ఇది నతస్యప్రతిమాస్తి మొదలగు శ్రుతివ్యాఖ్యానావసరమునఁ జక్కఁగానిరూపింతుము. మాయామయమగుమూర్తికూడ లేనేలేదని యానందగిరి యభిప్రాయమేకల్పించిన నిజముగాఁ గలఁడనుపర్యంతముచేసిన యనువాదము వ్యర్థమగు-ఇదియునుంగాక యిచట మూర్తియే లేదని నిషేధించి నపక్షమున గీతలలోని చతుర్థాయభాష్యటీకయందు భగవంతునికి మాయామయమూర్తి కలదను నా యానందగిరి యంగీకారము విరోధించును. సకలశ్రుతిస్మృతిసంప్రదాయవిదులగు నటువంటివారివచన మస్మదాదులవచనమువలెఁ బరస్పరవిరుద్ధమగుట యెన్నటికిని సంభవింపదు. ఆమూర్తి పాంచభౌతికమో యన్యాదృశమో యేదో యగుఁగాక. అస్తిత్వనాస్తిత్వవిచారమునఁ బాంచభౌతికత్వాపాంచభౌతికత్వవిచార మనవసరమని విరమింతుము. తరువాత శాస్త్రిగారు,

ఇదియునుంగాక శాంకరబ్రహ్మసూత్రభాష్య చతుర్థాధ్యాయ ప్రథమపాద తృతీయాధికరణమందు నప్రతీకేనహిసహ యను సూత్రము మొదలధ్యాయాంతమువఱకు ప్రతీకోపాసన నిరసింపఁబడె,

అని యేమేమో పెద్దయెత్తునకుఁ బోయిరి. ఇచట విచారింప వలసినయంశము చాలఁగలదు. పూర్వ మగ్నౌక్రియావతాం దేవయను శ్లోకమందలి యగ్నిపదముచేఁ బ్రాణాగ్నిని గ్రహింపవలెనని వ్రాయుట యెట్లు తదుపాసనాసంప్రదాయాజ్ఞానవిలసితమో యిప్పుడీ వ్రాయుటయు నట్లే సూత్రభాష్యానధ్యయన తత్సంప్రదాయాజ్ఞానవిలసితము. ఆయంశమే యిచట స్పష్టముగా వివరించుచున్నాఁడను. సూత్రభాష్యచతుర్థాధ్యాయమందు, ఆవృత్తి రసకృదుపదేశాతను సూత్రముచే శ్రవణమననాదులయభ్యాసము జ్ఞానముగలుగువఱకు చేయఁదగినదని నిరూపించి యటుపైని రెండవదగు, ఆత్మేతితూపగచ్ఛంతి గ్రాహయంతిచ యను సూత్రముచే జ్ఞానసాధనమగు ధ్యానమునభ్యసించుకాలమున నేనే బ్రహ్మనని ధ్యానింపవలెనా బ్రహ్మ నాకుఁ బ్రభువని ధ్యానింపవలెనా యని విచారించి యహంబ్రహ్మయనియే ధ్యానింపవలసినదని ప్రమాణోదాహరణపూర్వకముగ సిద్ధాంతీకరించిరి-అటుపైని నప్రతీకేనహిసః యను మూఁడవసూత్రముగలదు-అందుఁగూడ మనోబ్రహ్మేత్యుపాసీత, ఆకాశోబ్రహ్మ మొదలగు ప్రతీకోపాసనలందును వెనుకవలె నహంబుద్ధిచే నుపాసింపవలెనా మఱియొకవిధముగానా యని విచారణచేసి యహంబుద్ధితో నుపాసనచేయఁగూడదు, ప్రతీకములగు మనఆదులఁ బ్రధానములుగాఁజేసికొని బ్రహ్మోపాసనచేయవలెనని పైనిజెప్పిన యహంగ్రహోపాసన కంటె నీ ప్రతీకోపాసన విలక్షణమనునట్లు కనఁబఱుపఁబడియున్నది-అంతియేకాని యీసూత్రముచేఁ బ్రతీకోపాసన నిరసింపఁబడియుండలేదు-తరువాత బ్రహ్మదృష్టిరుత్కర్షాతను సూత్రముచేఁ బైనుదాహృతములగు ప్రతీకోపాసనలయందే యాదిత్యాదుల బ్రహ్మమని యుపాసింపవలెనా బ్రహ్మ మాదిత్యాదులని యుపాసింపవలెనాయని చర్చించి భృత్యుని రాజని స్తుతిచేయుట లోకమునఁ గలదుకావున నాదిత్యాదుల బ్రహ్మమని యుపాసించుటయే యుచితమని చెప్పుచుఁ బైనిజెప్పిన ప్రతీకోపాసనయే దృఢపఱుపఁబడియె-అటుపై నాదిత్యాదిమతయ శ్చాంగఉపపత్తేరనుసూత్రముచే

యఏవాసౌతపతి తముద్గీథముపాసీత మొదలగు శ్రుతివాక్యము లుదా
హరించి యాదిత్యాదులయందు సామభక్తివిశేషములగు నుద్గీథాద్యు
పాసనలు చేయవలెనని యంగావబద్ధోపాసనలు చెప్పఁబడె-కర్మలకు
సమృద్ధినిగలుగఁజేయు ఋత్విక్కర్మోపాసనలంగ నబద్ధమైనవిగాఁబడును-
ఈవిధముగఁ ద్వివిధోపాసనలు చెప్పి ఆసీనస్సంభవాత్ అనుసూత్రముచే
నుపాసనలు కూర్చుండి చేయవలెనని సిద్ధాంతము చేసిరి-అటుపై నాప్రా
యణాత్తత్రాపి హి దృష్టంచ యనుసూత్రముచే నహంగ్రహోపాస
నలు మరణపర్యంతముం జేయవలెనని చెప్పి యంతవఱకు తృతీయాధ్యా
యములోఁ జెప్పదగినయంశములే సమాప్తి చేసి తదధిగమ ఉత్తరపూ
ర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్ అనుసూత్రము మొదలా
ప్రథమపాదసమాప్తివఱకు బ్రహ్మవేత్త కాగామిసంచితకర్మసంబంధ
ము లేదనియు భోగముచేఁ బ్రారబ్ధకర్మక్షయమగుననియుఁ జెప్పి
ముగించిరి-తరువాత ౨వ పాదమందు వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ
మొదలగు కొన్ని సూత్రములచే మరణకాలమందు వాగాదీంద్రియ
ములు మనస్సులయందు లయమును బొందుననియు సగుణబ్రహ్మో
పాసకులకు దక్షిణాయనమందు మరణమైనను బ్రహ్మలోకము తప్పక
లభించుననియుఁ బ్రతిపాదించిరి-అటుపైని మూడవపాదమందు సగుణో
పాసకు లర్చిరాదిమార్గముగా నర్చిరాదినా తత్ప్రథితేః అను సూత్ర
ముచేఁ జెప్పి యామార్గక్రమముకూడఁ జక్కగ నిరూపణచేసి ప్రతీకో
పాసకులకు బ్రహ్మలోకప్రాప్తి లేదనిరి. 4వ పాదమందు సంపద్యావిర్భా
వస్స్వేనశబ్దాత్ మొదలగు కొన్ని సూత్రములచే నిర్గుణబ్రహ్మవేత్తల
కుఁ దత్ప్రాప్తిక్రమము చక్కగ నిరూపించి సంకల్పాదేవతుతచ్ఛ్రుతేః అను
సూత్రము మొదలనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్ అను సూత్రము
వఱకు సగుణబ్రహ్మోపాసనాఫలము చెప్పిరి. ఇంతటితో 4వ యధ్యా
యముకూడ సమాప్తమయ్యె. ఈవిధమున నాయధ్యాయార్థము శంక
రభాష్యమువలన స్పష్టమగుచుండ నధ్యాయసమాప్తివఱకు ప్రతీకో
పాసన యెక్కడ నిరసింపఁబడెనో కనిపెట్టుటకు యోగులకేని శక్యమగు

నని తోఁచదు. కనుక శాస్త్రిగారు వ్రాసినవిషయము శాస్త్రిగారికే గోచరము కావలె. పలుమాటలేల. ఇట్టిగ్రంథము వ్రాసినమహానుభావుఁడు ఘటమును బటమును జేయుటకేని సమర్థుఁడని తోఁచెడిని. ప్రతీకోపాసనాదిపరమగు గ్రంథమును దన్నిషేధపరముగా నన్వయించినవారి కే పనియు దుర్ఘటము కానేరదు. వీరిపాండిత్యవైభవము లోకవిలక్షణమనియే చెప్పనొప్పెడిని. పూర్వము, శ్లో॥ విదుషాంనివహైరిహైకమత్యా యదదుష్టం నిరటంకి యచ్చ దుష్టం। మయిజల్పతి కల్పకాధినాథే రఘునాథే మనుతాం తదన్యథైవ॥ అని రఘునాథశిరోమణిభట్టాచార్యులచేఁ దమగ్రంథమున వ్రాయంబడె. అట్లే యీచతుర్థాధ్యాయతాత్పర్యలేఖనముం గనఁబడెడి. కావున శ్రీశాస్త్రిగారికి రఘునాథశిరోమణితోఁ దౌల్యమనుభవించుట కిచ్ఛయున్నట్లు పొడఁగట్టెడి. కాని యిచ్చట నొకవిశేషము మాత్రము గ్రహింపవలె. రఘునాథశిరోమణి చెప్పుట తనపాండిత్యబలమునుబట్టియు స్వకీయగ్రంథములయం దద్వైతుల కత్యంతాదరము గలుగుటకునై యున్నది. ఏతదీయోక్తి స్వావిద్యాబలమునుబట్టియు స్వకీయగ్రంథములయం దద్వైతుల కత్యంతానాదరము కలుగుటను స్వపాండిత్యప్రకటనార్థమునై యున్నది. కనుక యీవిషయమింతటితో పరమింతము తదుపరి శాస్త్రిగారు

మరలఁ గేనోపనిషత్తునందు ౪వ ఋక్కు మొదలు యన్మనసానమనుతే యను ఋక్కుపర్యంతము నేదం యదిదముపాసతే యనుపదములకు వ్యాఖ్యానముచేయుసమయమున శంకరాచార్యులవారిచేతను నానందగిరులవారిచేతను నిది బ్రహ్మకాదని యనాత్మకు బ్రహ్మత్వము లేకపోవుటే నియమవిధికొఱకై తిరిగి చెప్పఁబడుచున్నది

అని సెలవిచ్చిరి. ఉపాస్యమునకు బ్రహ్మత్వోక్తి న్యాయ్యమే. అంతమాత్రముచే నుపాసనానిషేధముగాని ప్రతీకోపాసనానిషేధముగాని రానేరదు. శ్లో॥ ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా

మొదలగుశ్రుతులచే నుపాధివిశిష్టమగు నుపాస్యవస్తువు కల్పితమగుట చే నట్టివస్తువునకు వాస్తవబ్రహ్మభావన లేదని చెప్పుట యబ్రాహ్మణునకు బ్రాహ్మణత్వనిషేధమువలె నేసంగతిమగుచున్న యది. అసత్యమగుకల్పితవస్తువుయొక్క-యుపాసనచే, శ్లో॥ అసత్యేవర్త్మనిస్థిత్వా తతస్సత్యంసమీహితే యనుప్రమాణమువలన సత్యబ్రహ్మప్రాప్తికాఁగలదు. కనుక నే, శ్లో॥ కల్పితావేవజీవేశౌ మొదలగు నభియుక్తోక్తికూడ సంగతంబయ్యెడిని. తదనంతరము

బ్రహ్మప్రాప్తికొఱ్ఱ 32 బ్రహ్మవిద్యలు పూర్వాచార్యులచేఁ జెప్పఁబడియున్నవి. వానిలో బ్రహ్మలోకద్వారపాలకోపాసన యొకటి. దానిస్వరూపమెట్లని న,శ్రు॥ తస్యహవా ఏతస్యహృదయస్య పంచదేవసుషయః, సయోస్యప్రాఙ్సుషిః... .........ఆధ్యాత్మికాధిదైవతములం దంతటను సమానస్థితికనఁబడుటవలనను సమాన శబ్దస్వారస్యమువలనను సమానమునకు మహేశ్వరాభిధానము యుక్తము,

అని లిఖింపఁబడెను. ఇది యిట్లుండుఁగాక. ఛాందోగ్యమందు

1 తస్యహవాఏతస్య పంచదేవసుషయః. సయోస్యప్రాఙ్సుషిః సప్రాణః...

2 అథయోస్యదక్షిణస్సుషిః-సవ్యానః...

3 అథయోస్యప్రత్యఙ్సుషిః-సోపానః...

4 అథయోస్యోదఙ్సుషిః-ససమానః...

5 అథయోస్యోర్ధ్వసుషిః-సఉదానః...

అని యిత్యాదిక్రమ మున్నయది. ఈగ్రంధమందు 1 ప్రాఙ్సుషిః-సప్రాణః.. 2 ప్రత్యఙ్సుషిః- సోపానః...3 ...దక్షిణస్సుషిః- సవ్యానః...4...ఊర్ధ్వస్సుషిః- సఉదానః...5...ఉదఙ్సుషిః- ససమానః... అని భిన్నక్రమము లిఖింపఁబడియె. యెందులకని యోమందూకప్లుతి? ఈగ్రంథము లోకులవ్యామోహపెట్టనే వ్రాయఁబడెనో లేక లోకులకు బోధింపనేవ్రాయఁబడెనో?

న్నారు. ఇటువంటిమహానుభావులు ముందుఁబుట్టి వేదార్థములను నీరీతిగాఁజేసి వేదమాతను బాధపెట్టుదురని యెఱింగియేకాఁబోలుఁ బురాణములందు "బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయంప్రతరిష్యతి" అనఁగాఁ గొంచెముచదువుకొనినవానివలన "వీఁడు నన్ను బాధించును" అని వేదము భయపడుచున్నదని చెప్పిరి. మనమహర్షులు త్రికాలజ్ఞులు కదా. ఈవిమర్శనమువినఁగానే శ్రుతులయొక్కయర్థములనే స్మృతులు చెప్పుచున్నవని పూర్వులందఱొప్పుకొనియున్నారు. మేము చెప్పినట్లాశ్రుతులు రజస్వలావివాహములనే విధింపనియెడల మన్వాదిస్మృతికర్తలు శ్రుతివిరుద్ధములగు రజస్వలావివాహములను నెటులవ్రాసియుండిరని ప్రశ్నింపకపోరు. కాన

## సంస్కర్తలు రజస్వలావివాహములు స్మృతిప్రతిపాదితములని సాధించినారా?

లేదు,కాని యసందర్భలగు కొన్నిశ్లోకములనుజూపి స్మృతులు రజస్వలావివాహములను జెప్పుచున్నవని ప్రారంభించిరి. ఇందులకు మనుస్మృతి 9 అధ్యాయము, శ్లోకము 90 "త్రీణివర్షాణ్యుదీక్షేత,కుమార్యృతుమతీసతీ, ఊర్ధ్వంతు కాలాదేతస్మాద్విందేతసదృశంపతిం" కుమారి రజస్వలయై మూఁడుసంవత్సరములు నిరీక్షింపవలయును. తరువాత దనకుఁ దగినపతిని బొందవలెను" అని మనువు తెల్పియున్నాఁడు కానఁ బూర్వమున రజస్వలావివాహములే యుండెడివని చెప్పుచున్నారు. కాని యామనువుయొక్కయభిప్రాయ మిది కాదు. మను వీశ్లోకముతో నాపద్ధర్మమును బోధించియున్నాఁడు, కావుననే యీశ్లోకమునకుఁ బూర్వమున "ఉత్కృష్టాభిరూపాయ, వరాయ సదృశాయచ, అప్రాప్తామపితాంతస్మై కన్యాందద్యాద్యథావిధి" కులము సదాచారము వీనిచేత నుత్కృష్టుఁడుగాను గన్యకుఁదగినరూపముగలవాఁడుగాను దనజాతికిఁదగినవాఁడుగా నుండెడువరునకుఁ దనకూఁతు రెనిమిదివసంవత్సరమునకు లోనైయున్నను విధిప్రకారమిచ్చి వివాహముచేయవచ్చును, అని చెప్పి వెంటనే "కామమామరణాత్తిష్ఠేత్ గృహేకన్యర్తుమత్యపి నచైవైనాంప్రయచ్ఛేత్తు గుణహీనాయకర్హిచిత్॥" కన్యకు ఋతుకాలము సంభవించినను జచ్చువఱకుఁ దనయింటనే వివాహములేకయుండినను నుండవచ్చును గాని గుణములేనివరున కెప్పుడును గన్యక నీయరాదు. అని చెప్పియున్నవాఁడు ఈశ్లోకము గుణహీనుఁడగువరునకుఁ గన్యాదానము చేయుటను నిషేధించుచున్నది. కాని కన్యమరణపర్యంతము వివాహములేక పుట్టింట ఋతుమతియై పడియుండవలసినదని భావముకాదు. ఈవిధిననుసరించి తలిదండ్రులు సద్వరు నన్వేషించుచుండఁగా విధివశము

నఁ గన్య రజస్వలయైనయెడల నేమిచేయవలయునని ప్రశ్నరాఁగా మనువు "త్రీణివర్షాణ్యుదీక్షేత" యనుశ్లోకముతోఁ గన్య రజస్వలయై మూడుసంవత్సరములు నిరీక్షించి తరువాతఁ దగినపతినిఁ బొందవచ్చునని యనుజ్ఞ నిచ్చియున్నాఁడు కాని యీశ్లోకముతోఁ బ్రతికన్యయు ఋతుమతియై మూఁడుసంవత్సరములు నిరీక్షించి పిదపఁ బతినిఁ బరిణయమాడుమని విధించియుండలేదు. ఈశ్లోకమును బ్రాహ్మణాదిచతుర్వర్ణములయందును నాపద్ధర్మమును బోధించుటయందు సమన్వయింపవలెను-క్షత్రియులకు రజస్వలానంతరమందుఁ గాఁదగిన గాంధర్వరాక్షసములు ధర్మ్యములని "గాంధర్వో రాక్షసశ్చైవ ధర్మ్యౌ క్షత్రస్య తౌ స్మృతౌ" అను 3వ యధ్యాయము 26 వ శ్లోకముతో చెప్పియున్నాఁడు. ఇట్లే యితరధర్మశాస్త్రకర్తలును బల్వురు వచించియున్నారు. కాన క్షత్రియులలోను వారి ననుసరించిన శూద్రులలోను సద్వరునన్వేషించుచుండగా వివాహమునకుముందుఁ గన్య రజస్వలయైనయెడల మూఁడుసంవత్సరములునిరీక్షించి తలిదండ్రు లప్పటికి నొకరి కీయనియెడలఁ దా నేతనకుఁదగినపతిని బొందవచ్చునని యీశ్లోకము చెప్పినట్లు సమన్వయింపవలెను. ఇఁక బ్రాహ్మణులకును దదనుయాయులగు వైశ్యులకును రజస్వలావివాహములు కులభ్రష్టతకుఁ గారణములని యనేకధర్మశాస్త్రకర్తలు నిషేధించియుండుటచే నా జాతులయం దీశ్లోకమును సమన్వయింపవలసివచ్చినప్పుడు వివాహమునకుముందుఁ గన్య రజస్వలయగుటవలన భ్రష్టయై యామె వివాహయోగ్యురాలు కాకపోవుచున్నది కనుక యామె వ్యభిచారిణిగా మాఱుటకన్న నొకనినిగట్టుకొనియుండుటయుచితమని యీశ్లోకము బోధించుచున్నట్లు మనము తలఁపవలెను. అట్లుకాదేని మనుస్మృతి 9వ అధ్యాయములోని "కాలేదాతా పితా వాచ్యః" అను 4వ శ్లోకము కాలమునందు దానముచేయనితండ్రి నింద్యుఁడగుచున్నాఁడని చెప్పదు. కాలమనఁగా "ప్రదానంప్రాగృతోః" ఋతుమతియగుటకుఁబూర్వము దానకాలమని చెప్పెడి గౌతమధర్మసూత్రమును బ్రమాణముగా నిచ్చి కుల్లూకభట్టాచార్యులవారు కన్యాదానకాలనిర్ణయముఁ గావించియున్నారు. బ్రాహ్మణులకు దానపూర్వకవివాహములేకాని స్వయంవరవివాహములు స్మృతులం దెచ్చటను జెప్పఁబడియుండలేదు. కాన మేమువిన్నపించినట్లు "త్రీణివర్షాణ్యుదీక్షేత" యనుశ్లోకముచే బ్రాహ్మణాదికన్యలు విధివశమున వివాహమునకుముందు ఋతుమతులైనయెడ వారు హీనవృత్తికిఁబోక యొకనినివరించి తమజీవితకాలమును గడుపవలసినదని బోధించినట్లు నిర్ణయింపవలెను. ఇట్లింతఁ జెప్పినను మనసోదరులు బండపట్టును విడువక ప్రతికన్యయు రజస్వలయై మూఁడుసంవత్సరములు నిరీక్షించి తనకుఁదగినవరునివరించుటయందే యీశ్లోకము నన్వయించెదమందురా? ఆశ్లోకమునకుఁదరువాత నాలుగవ

శ్లోకము॥ త్రింశద్వర్షోవహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికం త్ర్యష్టవర్షోష్టవర్షాం వా ధర్మేసీదతి సత్వరః॥ ముప్పదివత్సరములుగలవరుఁ డందమైన 12 సంవత్సరముల కన్యను 24 సంవత్సరములవరుఁ డెనిమిదేండ్ల కన్యను వివాహము చేసికొనవచ్చును. ఇంతకుముందు నధ్యయనాదిధర్మములు వదలి వివాహము త్వరపడి చేసికొనినట్టయిన వాఁడు చెడునని మనువు తా నిదివఱకుఁ బ్రతికన్య రజస్వలయై మూఁడు వత్సరములు నిరీక్షించి స్వయంవరము చేసికొనవలసినదను మనవారి యభిప్రాయము నే విధించినయెడ నెంటనే యెనిమిదేండ్లు మొదలుకొని పండ్రెండేండ్లలోపలి కన్యలను నిరువదినాలుగు సంవత్సరములు మొదలుకొని ముప్పదేండ్లలోపలనున్న వరులు వివాహమాడుట యోగ్యమని యెట్లు చెప్పును? చెప్పదు. కాన మనవారివాద మసంగతమని స్పష్టముగాఁ జెప్పవచ్చును. ఇట్లు చెప్పగనే రజోదర్శనానంతరమునందుఁ గాఁదగిన గాంధర్వవివాహమునందు బ్రాహ్మణులకును "షడానుపూర్వ్యా విప్రస్య క్షత్రస్య చతురోవరాన్" అను శ్లోకముతో మనువు సావకాశ మొసంగియున్నవాఁడు బ్రాహ్మణవివాహము మొదలుకొని గాంధర్వము వఱకుగల యాఱు వివాహములను బ్రాహ్మణుఁడు చేసికొనవచ్చునని దీని యర్థము. కాన బ్రాహ్మణకన్యలను ఋతుమతులయినదాఁక వివాహము చేయకుండెడి యాచారముండినం గదా వారిని గాంధర్వవిధిని బ్రాహ్మణులు పరిగ్రహింపవలెను? లేకున్న నిది యెట్లు పొసఁగును?" అని ప్రశ్నింపకమానరు. అపుడు మనము సమాధాన మిట్లు చెప్పవలయును? పూర్వకాలమున ద్విజులు (బ్రాహ్మణక్షత్రియవైశ్యులు) తమజాతికన్యలనేకాక తక్కునజాతికన్యలనుగూడ వివాహమాడెడి యాచారముకలదు. అదిమనువు 3 వ అధ్యాయము 13 వ శ్లోకమగు "శూద్రైవ భార్యా శూద్రస్య సాచస్వాచ విశస్స్మృతే, తేచస్వాచైవరాజ్ఞశ్చ తాశ్చస్వాచాగ్రజన్మనః" అనుదానివలనఁ దెలియవచ్చుచున్నది. కాన బ్రాహ్మణుఁడు కామాధిక్యముచేత ననేకభార్యాత్వమును స్వీకరింపఁదలఁచెనేని క్షత్రియాదికన్యలను బరిణయమగుటకు ననుజ్ఞ యిచ్చెడి ప్రమాణవచనమై యున్నది. అంతియకాని తనజాతికన్యను గాంధర్వవిధిని బరిణయముఁజేసికొనవచ్చునని యర్థముకాదు. కావుననే పరాశరుఁడు సత్యవతిని నగస్త్యుఁడు లోపాముద్రను, వసిష్ఠుఁ డక్షమాలను, గాంధర్వవిధిని వివాహమాడియున్నారు. ఇంతియకాని తనజాతి కన్యను రజోదర్శనానంతరమున బ్రాహ్మణుఁడు వివాహమాడినట్లు కానరాదు. అట్లు బ్రాహ్మణుఁడు స్వజాతికన్యను రజోదర్శనానంతరమున వివాహమాడుటకవకాశమే ధర్మశాస్త్రములం దున్నయెడల రజస్వలను వివాహమాడిన బ్రాహ్మణునకు నపాంక్తేయత్వము, వృషలీపతిత్వము, గలుగుననెడి వచనములకు గతియే లేకపోవును. ప్రస్తుతమందు విజాతికన్యలను ద్విజులు వివాహమాడెడి యాచార

ము శాస్త్రములచే నిషేధింపఁబడి వ్యవహారముచే దూరీకృతమైయున్నది. కాన నీయుగమందు నదిచెల్ల నేరదు. ఇట్లుచెప్పినవెంటనే "విజ్ఞానేశ్వరీయమితాక్షరధర్మశాస్త్రమునందు "గమ్యం త్వభావే దాతౄణాం కన్యా కుర్యా త్స్వయంవరం" తనను దానము చేయవలసిన దాతలయభావమునందుఁ గన్య స్వయంవరముజేసికొనవచ్చు"నని చెప్పఁబడియున్నది. పూర్వకాలమున స్వయంవరవివాహములే లేనియెడల విజ్ఞానేశ్వరీయమునం దిది యెట్లు చెప్పఁబడినది?" అని కొందఱు ప్రశ్నించుచున్నారు. ఈయభిప్రాయము మితాక్షరధర్మశాస్త్రవిరుద్ధమైనది. అదెట్లన? ఈశ్లోకము వెనుకనే యాజ్ఞవల్క్యమహర్షి "పితా పితామహో భ్రాతా సకుల్యో జననీ తథా కన్యాప్రదః పూర్వనాశే ప్రకృతిస్థః పరఃపరః అప్రయచ్ఛన్ సమాప్నోతి భ్రూణహత్యా మృతావృతౌ॥ తండ్రి, తాత, అన్న, లేక, తమ్ముడు, జ్ఞాతి, తల్లి, లోనగువారు క్రమముగా ఋతుమతియగుటకుఁబూర్వము కన్యాదానముఁ జేయుట కర్హులు. అట్లుదానముఁ జేయనివాఁడు బిడ్డయొక్క ప్రతిఋతువునందును భ్రూణహత్యాదోషమును బొందుచున్నాఁడు" అని చెప్పియున్నాడు. కన్య రజోదర్శనానంతరమున స్వయంవరమును జేసికొనవలసినదనునది యీయనయభిప్రాయమే యైనయెడల "ఋతుమతియగుటకుఁబూర్వము కన్యాదానము జేయనివాఁ డాకన్యయొక్క ప్రతిఋతువునందును భ్రూణహత్యాదోషముఁ బొందుచున్నాఁ"డని యెట్లు చెప్పును? చెప్పఁడు. కాన మితాక్షరధర్మశాస్త్రము ఋతుమతీవివాహముబోధించుచున్నదనువాదము నిరాధారమైనది. ఇట్లువిన్నవించినతోడనే మరల మనసోదరులు "కుమార్యృతుమతీ త్రీణివర్షాణ్యుపాసీత ఊర్ధ్వం త్రిభ్యోవర్షేభ్యః పతిం విందే త్తుల్యం" అని వసిష్ఠస్మృతియందుఁ జెప్పఁబడియున్నది. అనఁగాఁ గన్య ఋతుమతియై మూఁడువత్సరము లెదురుచూచి పిదపఁ దుల్యుఁడగుపతిని స్వయంవరముగావించుకొనవలసినదనియర్థము. దీనింబట్టి పూర్వకాలమున స్వయంవరవివాహములు చెల్లుచుండెడి"నని కొందఱు చెప్పుచున్నారు. ఇదియును మనుయాజ్ఞవల్క్యస్మృతులవలెనే స్త్రీల కాపద్ధర్మముగా స్వయంవరవివాహమును బోధించుచున్నదే కాని ప్రతి కన్యకకు నట్లు ఋతుమతీవివాహము నిరూపించియుండలేదు. ఒకవేళ విధిగానే చెప్పినదని మనసోదరులు వాదింప మొదలిడుదురేమో? అటులేని నావెంటనే వసిష్ఠుఁడు "పితుః ప్రమాదాత్తు యదీహ కన్యా వయఃప్రమాణం సమతీత్య దీయతే సాహంతి దాతారమదీక్షమాణా కాలాతిరిక్తా గురుదక్షిణేవ, తండ్రిపొరబాటువలనఁ గన్య వయస్సుమీఱినవెనుక దానముచేయఁబడినయెడల నాకన్య కాలాతిరిక్తమగు గురుదక్షిణవలెనే గాతను (తండ్రిలోనగువారిని) నాశనముఁ జేయుచున్నదనియెట్లు చెప్పును? ఇంతియ

కాదు. "సమగ్రాడనిపడుచునూ ఋతుకాలభయముచేఁ దండ్రి దానముచేయవలసినది. లేకున్న నాకన్య ఋతుమతియైయున్నయెడ దోషము తండ్రినిఁబొందును" అనునర్థముగల "ప్రయచ్ఛేన్నగ్నికాంకన్యాం ఋతుకాలభయాత్పితా. ఋతుమత్యాంహితిష్ఠంత్యాం దోషఃపితరమృచ్ఛతి" అనుశ్లోకమునుగూడఁ జెప్పియున్నాఁడు, కాన వసిష్ఠుఁడు రజోదర్శనానంతర స్వయంవరవివాహమును బోధించినాఁడని మనసోదరులువచించెడి మాట బూటకమని యీదానివలనఁ దేటపడినది. ఇట్లుచెప్పఁగా సంస్కారులుమరల "బోధాయనుఁడు త్రీణివర్షాణ్యృతుమతీ కాంక్షేతపితృశాసనం తతశ్చతుర్థేవర్షేతు విందేతసదృశంపతిం అవిద్యమానేసదృశే గుణహీనమపిశ్రయేత్॥ కన్య ఋతుమతియై మూఁడుసంవత్సరములు తండ్రియాజ్ఞనుఁ గోరియుండి తరువాత దనకుఁ దగినవరునిఁ దానె వరించుకొనవలయును. సదృశుఁడు సంభవింపనియెడల గుణహీనునైనను గూడవలెను" అని తెల్పియున్నవాఁడు. దీనింబట్టి తొల్లి రజోదర్శనానంతరస్వయంవరవివాహములేకావింపఁబడుచుండెడివి. కానిచో బోధాయనుఁడిట్లేలచెప్పును? అని యడుగుచున్నారు. కాన వారి కిట్లుసమాధానముఁ జెప్పెదను.- బోధాయనుఁడును వెనుకటిధర్మశాస్త్రకర్తంవలెనే యీశ్లోకముతో స్త్రీల యాపద్ధర్మమునుజెప్పియున్నాఁడు. మీరుతలంచినట్లు రజోదర్శనానంతరస్వయంవరవివాహములను జెప్పియుండలేదు. అట్లు చెప్పియుండినయెడల నావచనమునకుదిగువనే "త్రీణివర్షాణ్యృతుమతీం యఃకన్యాం నప్రయచ్ఛతి. సతుల్యం భ్రూణహత్యాయై దోషమృచ్ఛత్యసంశయం॥ ఎవఁడు మూఁడుసంవత్సరములవఱకు ఋతుమతియైయున్నకన్య నొకనికీయఁడో వాఁడు భ్రూణహత్యతో సమానమైన దోషమునునిస్సంశయముగాఁ బొందుచున్నా" డని యెట్లు చెప్పెను? పైశ్లోకముతోఁ "బతికన్యయురజస్వలయై మూఁడువత్సరములునిరీక్షించి పరిణయముకావించుకొనవచ్చునని చెప్పి దిగువశ్లోకముతో కన్య ఋతుమతియై మూఁడుసంవత్సరములునిరీక్షించిన నాపెతండ్రి భ్రూణహత్యాతుల్యదోషమునుబొందు,,నని చెప్పునా? చెప్పఁడు. ఇంతియకాక యీశ్లోకములకు వెనుక "దద్యాద్గుణవతేకన్యాంనగ్నికాం బ్రహ్మచారిణే అపివాగుణహీనాయ నోపరుంధ్యాద్రజస్వలాం,, గుణవంతుఁడగుబ్రహ్మచారికి నగ్నిక (సమగ్రాడనిది) యగుకన్యను దానముచేయవలసినది. అట్టివాఁడులభింపనియెడల గుణహీనునకైనను నీయవలసినదేకాని యాకన్య రజస్వలయగువఱకు వివాహముచేయకయుండవలె,, దని స్పష్టముగాఁజెప్పిన బోధాయనుఁడు రజోదర్శనానంతరస్వయంవర వివాహములను వచించినాఁడనుటకంటె వంచనబోధ మతియొకటికానరాదు. అట్లేని "త్రీణివర్షాణ్యృతుమతీ" యనుశ్లోకమునకు వినియోగమేమనియడిగెదరా? మేమిది

మఱియు మనుస్మృతిలోని "త్రీణివర్షాణ్యుదీక్షేత" యనుశ్లోకమునకుఁ జెప్పినవినియోగమే దీనికిని నగునని గ్రహింతురు గాక. ఇటువంటివచనము లెచ్చటఁగనుపడినను వాని నిట్లే సమన్వయించుకొనవలసినదని మాసోదరులను బ్రార్థించుచు నీవిషయమునువిడిచి.

## సంస్కర్తలు బాల్యవివాహములు స్మృతివిరుద్ధములని స్థిరపఱచిరా?

ఆనువిషయమును ముచ్చటింపఁగడంగుచున్నాము. సంస్కర్తలు బాల్య వివాహములు స్మృతివిరుద్ధములనిసాధించుట సూర్యచంద్రులకుగమనముండగా సంభవించునది కాదు. బాల్యవివాహము లుచితములని చెప్పెడి స్మృతివాక్యముల మొదటనిచ్చి వాని యకరణమందుఁజూపిన ప్రత్యవాయవచనములను వ్రాయుచు వాని యర్థములను సంగ్రహముగా నివేదించుచుందుము - కాన శ్రద్ధాళురై చదువుదురు గాక మనుస్మృతి అధ్యాయము 9 శ్లోకము 94. "త్రింశద్వర్షోవహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికం। త్ర్యష్టవర్షోష్టవర్షాంవా ధర్మేసీదతిసత్వరః" ముప్పదివత్సరములుగలవాఁడండ్రైన 12 సంవత్సరములుగలకన్నియను 24 సంవత్సరములుగలవాఁ డెనిమిదేండ్లకన్నియను వివాహమాడవలెను. దీనింబట్టి మనువు కన్యలకు బాల్యమున వివాహము చేయుమని చెప్పినాఁడనుట కేవిధమగుసందేహము లేదుకదా ఇఁక నీవివాహములను జేయనికన్యాదాతలకుఁ బ్రత్యవాయము మను విట్లువచించుచున్నాఁడు. 9 అధ్యాయము 4 శ్లోకము "కాలేదాతాపితావాచ్యః" ఇందులకుఁ గుల్లూకభట్టాచార్యులవ్యాఖ్య "ప్రదానకాలే పితా తామదదత్ గర్హ్యోభవతి ప్రదానంప్రాగృతోరితి గౌతమవచనాత్ ఋతోఃప్రాగ్వివాహకాలః" తగినకాలమునందుఁ గన్యను దానము చేయనితండ్రి నింద్యుఁడగుచున్నాఁడు. ఋతుమతియగుటకుఁబూర్వమే ప్రదానకాలమని గౌతమునివచనమువలనఁ దెలియవచ్చుచున్నది. పరాశరుఁడు దానముచేయఁదగిన కన్యయొక్క ప్రాయమునుగూర్చి యిట్లు చెప్పుచున్నాడు. "అష్టవర్షాభవేద్గౌరీ నవవర్షాతురోహిణీ। దశవర్షాభవేత్కన్యా అతఊర్ధ్వంరజస్వలా" అనఁగా నెనిమిదేండ్లపిల్ల గౌరియనియుఁ దొమ్మిదేండ్లబిడ్డరోహిణియనియుఁ బదివత్సరములబాలిక కన్యయనియుఁ నటుపిమ్మట రజస్వలయనియు దీని యర్థము. ఈశ్లోకమునకు "సర్వజ్ఞస్సహిమాధవః" అనుబిరుదమునందికొనియున్న శ్రీమాధవాచార్యులవారు "గౌర్యాదయస్త్రిస్ర ఊద్వాహాయ శుద్ధాః తద్దాతుః ఫలవిశేషస్మరణాత్ రజస్వలా త్వశుద్ధా తద్దానస్య నిందితత్వాత్" అని వ్యాఖ్యానముఁజేసియున్నారు. అనఁగా గౌరీరోహిణికన్యలుముగ్గురు వివాహమునకుఁ బరిశుద్ధలు. కారణమేమనఁగా వారినిద్దానముజేసిన

వారికి ఫలము విశేషము గాఁ జెప్పఁబడియుండుటంబట్టి రజస్వల యాశుద్ధురాలు. హా, తువేమన? దానినిచ్చుట నింద్యమాగువటలన" అని ఇట్లుచెప్పి యీవివాహములవలని ఫలమును నిందను దెలిపెడి "గౌరీందద న్నాకపృష్ఠం వైకుంఠం రోహిణీందదత్ । కన్యాంతదద్బ్రహ్మలోకం రౌరవంతు రజస్వలాం" అను బృహస్పతివచనమును జూపి యున్నాఁడు. గౌరినిదానముఁజేసినవాఁడు పరబ్రహ్మపదమును రోహిణి నిచ్చినవాడు వైకుంఠమును గన్యనుదానముచేసినవాఁడు బ్రహ్మలోకమును రజస్వలనుదానమొసర్చిన వాఁడు రౌరవనరకమును బొందుచున్నాఁడని దీనియర్థము. ఆవెంటనే పరాశరుఁడు "ప్రాప్తేతుద్వాదశేవర్షే యఃకన్యాం నప్రయచ్ఛతి । మాసిమాసిరజస్తస్యాః పిబంతిపితరోనిశం" పంద్రెండవసంవత్సరము ప్రాప్తించినదగుచుండగా గన్య నెవఁడు దానము జేయఁడో వానిపితరు లెల్లప్పుడు ప్రతినెలయందు దానిరజస్సును బానముఁజేయుచున్నారని ప్రత్యవాయమును దెల్పియున్నాఁడు. 10 సంవత్సరములమీఁద 12 సంవత్సరములలోపలఁ గన్య దాతయుఁ బ్రతిగ్రహీతయు నింద్యులుకానేరరు. ఈవిషయమునుగూర్చి మాధవాచార్యులవారు "అసత్యృతుదర్శనే ద్వాదశేవర్షే కన్యాదానప్రతిగ్రహౌ నవిషిద్ధౌ, అనువాక్యమునువ్రాసి తమయి యభిప్రాయమును బలపఱచుకొనుటకు మనుస్మృతిలోని "త్రింశద్వర్షోవహేత్కన్యాం" అనుశ్లోకమునువ్రాసియున్నారు. పరాశరుఁడుమఱి రెండుశ్లోకములతోఁ బ్రత్యవాయమునేవ్రాసియున్నాఁడు. 'మాతాచైవ పితాచైవ, జ్యేష్ఠభ్రాతా తథైవచ, త్రయస్తేనరకంయాంతి దృష్ట్వాకన్యాంరజస్వలాం" యస్తాం సముద్వహేత్కన్యాం బ్రాహ్మణోమదమోహితః, అసంభాష్యోహ్యపాంక్తేయః సవిప్రోవృషలీపతిః" తల్లి, తండ్రి, పెద్దన్న, ముగ్గురును దానము జేయుటకుముందు రజస్వలయైయున్నకన్యనుజూచి నరకమునుబొందుచున్నారు. ఏబ్రాహ్మణుఁడు మదమోహితుఁడై యీరజస్వలయైయున్నకన్నెను వివాహముచేసికొనునో వాఁడసంభాష్యుఁడును, నపాంక్తేయుఁడును వృషలీపతియునగును. దీనింబట్టి పరాశరుఁడు బాల్యవివాహములు పరమోత్కృష్టములనియు, రజస్వలావివాహములు పరమనిషిద్ధములనియుఁ జెప్పినట్లు బోధపడినదికదా.

ఇఁక నీవిషయమై యంగిరసుఁడేమి చెప్పుచున్నాఁడో చూడుఁడు. రజస్వలావివాహములవలనగలిగెడి ప్రత్యవాయమునుమాత్రమె చెప్పియున్నాఁడు. "పిత్రువేశ్మనియాకన్యా, రజస్సంపశ్యేత్, భ్రూణహత్యా పితుస్తస్యాః, సాకన్యా వృషలీస్మృతా, మాతాచైవపితాచైవ జ్యేష్ఠభ్రాతా తథైవచ, త్రయస్తే నరకంయాంతి దృష్ట్వాకన్యాం రజస్వలాం॥ ఉద్వహేద్యస్తుతాంకన్యాం బ్రాహ్మణోమదమోహితః,

అసంభాష్యోహ్యపాంక్తేయః, సవిప్రోవృషలీపతిః,, ఏకన్య తండ్రియింట రజస్వలయగునో దానితండ్రికి భ్రూణహత్యాదోషమును, నాకన్య వృషలియును, నని చెప్పఁబడుచున్నది. తల్లి, తండ్రి, అన్న, ముగ్గురు రజస్వలయైయున్నకన్యనుజూచి నరకమునుబొందుచున్నారు. ఆ రజస్వలయైనకన్యను బ్రాహ్మణుఁడు మదమోహితుఁడై వివాహముజేసికొనినచో వాఁడసంభాష్యుఁడనియు, నపాంక్తేయుఁడనియు, వృషలీపతియనియుఁ జెప్పఁబడుచున్నాఁడు.

మనుస్మృతి. "అష్టవర్షాభవేద్గౌరీ, నవవర్షాతురోహిణీ, దశవర్షాభవేత్కన్యా, అతఊర్ధ్వం రజస్వలా,, అర్థ మిదివఱకే వ్రాయఁబడినది. "మాతాచైవ పితాచైవ జ్యేష్ఠభ్రాతా తథైవచ, త్రయస్తే నరకంయాంతి దృష్ట్వాకన్యాంరజస్వలాం,, పితుర్గేహేతు యాకన్యా రజః పశ్యత్యసంస్కృతా, భ్రూణహత్యాపితుస్తస్యాః కన్యాసావృషలీ స్మృతా యస్తాంవివాహయేత్కన్యాం బ్రాహ్మణోమదమోహితః అసంభాష్యో హ్యపాంక్తేయః, సవిప్రోవృషలీపతిః,, ప్రాప్తే ద్వాదశేమేవర్షే యఃకన్యాంనప్రయచ్ఛతి. మాసిమాసి రజస్తస్యాః పితాపిబతిశోణితం,, ఈశ్లోకములకు నర్థము వెనుకఁబరాశరుని శ్లోకములకుఁదెలిపినదే యగుటవలన మఱల వ్రాయమానితిమి. అటఁజూడఁగోరెదము.

లఘుశాతాతశస్మృతి "పిత్రువేశ్మనియాకన్యా రజఃపశ్యత్యశసంస్కృతా। భ్రూణహత్యా పితుస్తస్యాః సాకన్యావృషలీస్మృతా" యని చెప్పుచున్నది. అర్థమిదివఱకె వ్రాయఁబడినది.

వేదవ్యాసస్మృతి. "యదిసాదాతృవైకల్యాద్రజఃపశ్యేత్కుమారికా। భ్రూణహత్యాశ్చతావత్యః పతితస్స్యాత్తదప్రదః" దాతయొక్క ప్రమాదమువలనఁ గుమారిక వివాహమునకుముందు రజస్వలయైనయెడ నన్ని ఋతువులు నన్ని భ్రూణహత్యలగును. ఆకుమారికను దానముచేయనివాఁడు పతితుఁడగుచున్నాఁడని చెప్పుచున్నది. ఈవిధముగాఁ జెప్పినవాఁడష్టాదశపురాణనిర్మాతయు బ్రహ్మసూత్రధాతయు భారతామ్నాయప్రణేతయు వేదవిభాగవిధాతయు నిఖిలధర్మనిర్ణేతయు నగు వేదవ్యాసమహర్షియైయున్నవాఁడు ఆయనవాక్యము నుల్లంఘించినమనకు గతులుకలుగునని చెప్పుటకాధారమేమైనకలదా? లేదు.

వీనినన్నిటినింబట్టిచూడ దానపూర్వక (రజస్వలాత్పూర్వ) వివాహములు స్వర్గదాయకములనియు బర (రజస్వలా) వివాహములు నరకదాయకములనియుఁ దేలినది. ఇఁక నీవివాహములవలనఁగలిగెడి సంతానఫలముంగూర్చి యించుకముచ్చటించి యీవిషయమునువిడిచెదము.

ప్రధాన పోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు

2. రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు కుమార జమీందారుగారు, గంపలగూడెం.

సహాయులు

6 తుమురుకోట నరసింహారావుగారు. తిరుమలగిరి.

17 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు వాల్కార్టు బ్రదర్సుకంపెనీ

18 ఓకుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమీదీపురం

19 ఉల్లగంటి వీరరాఘవరావుగారు, ముక్తాదారు, ఆసేపురం

20 శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీల్దారు జగితాల

21 పాకుంట శంకరరావు దేశపాండ్యాగారు జగితాల

22 పట్టివర్ధనం సీతారామరావుగారు-వకీల్-కంభంమెట్టు

## ఈనెల సొమ్ముచెల్లించిన చందాదారులు.

1. కొటికలపూడి హనుమంతరావుగారు, "డైరెక్టర్ ఆత్మకూరు లిఫ్టు ఇర్రిగేషన్ కంపెనిలిమిటెడ్" మంగళగిరి.
2. పుచ్చా సీతారామశర్మగారు, పెదకొండూరు.
3. సూరి వెంకటనరసింహముగారు, వకీలు, బెజవాడ.
4. కొప్పరాజుగురుచంద్రశేఖరరావుగారు,ఫారెస్టుగార్డు,కండ్లగుంట.
5. ములుకుట్ల వీరరాఘవశాస్త్రిగారు, ఇంకొల్లు.
6 కృత్తివెంటి గంగరాజుగారు, బందరు.
7. ధూళిపాళ అనంతయ్య, నరసింహంగార్లు, మతుపల్లి.
8. చెన్నూరు విచ్చయ్యగారు, దేశపాండ్యా, పెదపీసు.
9 చివుకుల శ్రీరామశర్మగారు, నాగులువ్పలపాడు.
10. జానపాటి వెంకటప్పయ్యగారు, వేమవరం.
11. కంధం నాగేశ్వరరావుగారు, పోలీసుసబ్ ఇన్స్పెక్టరు. బొమ్మరాజుపల్లె.
12. చివుకుల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పల్లెకోన.
13. కొతా పుండరీకాక్షుడుగారు, జిల్లాకోర్టుప్లీడరుగుమస్తా గుంటూరు
14. మల్లాది కామయ్యగారు-చింతపల్లిదొరసానిసంస్థానము
15. పన్నాల బుచ్చిరామయ్యగారు, గుంటూరు.
16. చివుకుల వెంకటాచలశాస్త్రిగారు, సికింద్రాబాదా.

# అభినవసరస్వతి

## పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇదియొక మాసపత్రిక-ఇందు ప్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును, ప్రకటింపఁబడును ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలిక వ్యాసములవలనఁగలుగు నానందము గాక చందాదారులకు 2-3 అపూర్వగ్రంథము లలవడును. చందాసంవత్సరమునకు రు 2-0-0

### ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | |
|---|---|---|
| 1 అళ్వయాచార్యవిజయము | ... ... | 0 4-0 |
| 2 కరిణీకోద్ధారిణి (పూరెవీరభద్రకవి) | ... ... | 0-4-0 |
| 3 వాసంతికా పరిణయము | ఇవి రెండును నాటకములు ... | 0-4-0 |
| 4 కంసవధము | ... | 0-8-0 |
| 5 చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | ... | 0-4-0 |
| 6 విరూపాక్షపీఠగురుపరంపర | ... ... | 0-2-0 |
| 7 నీతిగీతులు (సుమతి శతకమునకు సంస్కృతము) | .. | 0-2-0 |
| 8 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | ... | 0-2-0 |
| 9 అత్యద్భుతవిమర్శనము (మరి॥ కృష్ణదేవరాయచార్యులు వెంకటరామకృష్ణకవులయవధానములపైవిమర్శనము) | ... | 0 5-0 |
| 10 చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము (పత్రికాధిపతి) | ... | 0-4-0 |
| 11 సంగదోషము (సంగదోషముచేఁబట్టుదలవదలనియోగుని చరిత్రఁదెలుపు నొకచిన్న పద్యరూపముగుకథ | ... | 0-3-0 |
| 12 వీరభాగవతము (ముదిగొండ వీరభద్రకవి) | ... | 1-4-0 |
| 13 పుళిందావివాహము ( పత్రికాధిపతి) | ... | 0-4-0 |
| 14 గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిరాకరణము, పిష్టపేషణము | | 0-4-0 |
| 15 శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0-4-0 |
| 16 లక్ష్మీవిలాసము (రాయసము వెంకటపతి) | ... | 0-4-0 |
| 17 నర్సారావుపేట శతావధానము (తిరుపతి వెంకటేశ్వరులు) | ... | 0-8-0 |
| 18 పశ్యాంపుశ్యాం | ,, ... | 0-2-0 |
| 19 పశ్యశబ్దవిచారము | ,, ... | 0-2-0 |
| 20 వేమవరాగ్రహార శతావధానము | ,, ... | 0-12-0 |
| 21 పురశ్చరణము | ,, ... | 0-2-0 |

 వలయువారలు సొమ్ముపంపిగాని వి. పి. ద్వారాగాఁగాని ఈ క్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

జానపాటి పురుషోత్తం, సబ్ ఎడిటర్

జానపాడు, పిడుగురాళ్ళ పోష్టు, గుంటూరుజిల్లా.